

శ్రీజనాభ్యుదయమునకై మేము నిర్వహిస్తున్న కార్యక్రమము నభినందిస్తూ మద్రాసులోని వివిధ వర్తకప్రముఖులు దయతో మా సభకొసగిన విరాళములను ప్రకటిస్తున్నాము.

పాప్యులర్ సైకిల్ ట్రేడింగు కంపెనీవారు రు. 250/- లును, సౌత్ ఇండియా సైకిల్ ఇంపోర్టింగు కంపెనీవారు రు. 250/- లును, దాదా అండ్ కంపెనీవారు రు. 250/- లును, ఎ. బి. పరేక్, దిగుమతి వ్యాపారస్తులు రు. 250/- లును, జె. యం. సేట్ కంపెనీవారు రు. 250/- లును, సి. జె. సేట్ కంపెనీ వారు రు. 250/- లును, ష్యామ్ అండ్ కంపెనీవారు రు. 250/- లును, సి. సంజీవచెట్టి అండ్ కంపెనీవారు రు. 250/- లును, లక్ష్మణ పెరుమాళ్‌చెట్టి కంపెనీవారు రు. 125/- లును, సి. వై. ఆంజనేయులు చెట్టి అండ్ కంపెనీ వారు రు. 125/- లును, ఎ. కన్నన్ చెట్టి కంపెనీవారు రు. 100/- లును, రావుబహదూర్ నాదముని చెట్టి అండ్ కంపెనీవారు రు. 100/- లును మాకు అందజేసారు. వీరికి మా హృదయపూర్వ కాభివందనములు.

రాణీ రాజ్యలక్ష్మీ పారిశ్రామిక విద్యాలయ విద్యార్థినుల శిక్షణ కును, వీరిలో కొంతమంది బీద విద్యార్థినుల భోజనవసతి నిమి త్తమును, పైనుదహరించిన విరాళములు వినియోగించబడును.

జె. జమునాబాయి

ఎ. చెన్నఘంటమ్మ

కార్యదర్శినులు

ఆఫ్రికానుండి

# కుష్ఠు ★ బొల్లి

జిబ్రాల్టరుకు

**గ్యారంటీ చికిత్స!**

## వాడబడుచున్నవి మా ఔషధరాజములే!

### ఋతుశూల నివారిణి

ఋతుకాలమున స్త్రీలకు గల్గు యెట్టి విపరీతమగు శూలనొప్పులనైనను మూడు రోజులలో తగ్గించును. ఎంతకాలమునుంచియున్నను, వెంటనే తగ్గును. ఋతుదినములు మూడింటనే వాడునది. ఋతుశూలనియ్యది మంత్రించినట్లు పోగొట్టును.

### బొంబాయి

ఎం. ఏ. యిరాని,

మల్యాన్, డాహానురోడ్, బి. బి. & సి. ఐ. రైల్వే.

మల్యాన్, 4-1-1944.

అయ్యా,

మీమందు మొదలు పెట్టిన మొదటిదఫాకే అది బాగా ఫలిత మిచ్చిందని తెలుపుటకు సంతోషిస్తున్నాను. ఎరుపుమచ్చలు వాటి మామూలు రంగుకు వస్తున్నవి. నరములనొప్పి మటుమాయమైనది. మీ చికిత్సతో రోగి వ్యాధినయము కాగలదని నమ్ముచున్నాను.

ఇట్లు,

(సం॥) ఎం. ఏ. యిరాని.

### సువర్ణ గంధక పుష్పం

స్త్రీలకు గలుగు ఋతుదోషములు అనగా ఋతుస్రావము (తెలుపు, ఎరుపు, నలుపు) రంగుమారుట—దుర్వాసన గలిగియుండుట—అసలు బహిష్టయే గాకుండుట—మొదలగు సర్వ స్త్రీ ఋతుదోషములను పోగొట్టి, క్రమ ఋతువును గలిగించును. గోండ్రాంగ్రు వాడిన సంతానవతులగుదురు.

కొత్తగా అచ్చువేయబడిన మా పెద్ద తెలుగు క్యాటలాగు, 10 భాషలలో కేటలాగులు, యోగ్యతా పత్రములు

**ఉచితము!**

బ్రాంచ్ ఆఫీసులు:

బెజవాడ

గాంధినగర్.



సికింద్రాబాద్

3560, కింగ్స్ వే.



## రెడ్డి & కో.,

(రిజిస్టర్డ్)

### H. O.

గోపాలపురం,

తణుకు, తూ. గోదావరి

బ్రాంచ్ ఆఫీసులు:

వాల్తేరు

R. S. పోష్టు



కటక్

బక్సి బజార్.



అన్ని దేశములలో, అన్ని
ఋతువులలో తేనీరు నిజముగా సేదదీర్చు పానీయము.
ఇదే కారణముగా సహజమైన కమ్మనివాసనగల తాజాయైన బ్రూక్‌బాండ్ తేయాకు భారతదేశమందలి ఇతర రాష్ట్రములయందువలె సంయుక్త రాష్ట్రములోకూడా జనప్రియముగానున్నది. సంవత్సరము పొడుగూ ఉల్లాసమును చేకూర్చు పానీయము.






# బ్రూక్ బాండ్

రెండాకులు ఒక మొగ్గ

# ఆంధ్రమహిళ

సంపుటి 4 :: 30 జూలై 1947 :: సంచిక 2

ముఖచిత్రం : విజయంలో విచారమా



—: ప్రచురణ :—

ఆంధ్రమహిళా సభ, మైలాపూరు

సంవత్సర చందా ★ అయిదు రూపాయిలు




సంపుటి 4 30 జూలై 1947 సంచిక 2

# ఆనందబాష్పములా? అ...సుతాపాశ్రువులా?...

బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించిన భారత స్వాతంత్ర్య చట్టంలోని ప్రధాన హాంశం భారతదేశ ప్రజలను బానిసత్వంనుండి విముక్తిచేయడమే. ఇకనుండి జాతీయ అంతర్జాతీయ వ్యవహారములకు అనువైన శాసనాలుచేసే హక్కు, వాటిని అమలు జరిపే స్వాతంత్ర్యము మనము నిర్మించే శాసనసభలకు, ప్రభుత్వమునకు అప్పజెప్పబడింది. తత్ఫలితంగా ఇంగ్లాండు రాజుగారికి "భారతదేశపు చక్రవర్తి" అనే బిరుదు అంతరిస్తుంది. మన జాతీయోద్యమం నేటికి ఫలించి భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అందుకోగలిగింది. ఈ స్వాతంత్ర్య పోరాటంలో వేనకువేలు పురుషులు స్త్రీలు కఠిన కారాగారశిక్ష అనుభవించడమే గాక, పోలీసు లాఠీలకు, తుపాకీ కాల్పులకు బలియై తమ సర్వస్వం దేశసౌభాగ్యానికై సమర్పించారు. వీరే నవ్య భారతదేశ నిర్మాతలు. స్వాతంత్ర్యోదయమైన యీ శుభసమయంలో వీరికి ఆంధ్రమహిళ జోహారులు.

భారతజాతి చరిత్రలో నేడు నూతనశకం ప్రారంభమైంది. కాని పరాధీనతకు స్వస్తి చెప్పి స్వాతంత్ర్యము సాధించగలిగినందుకు పొందవలసినంత విజయోత్సాహం ప్రజలలో లేదు. భారతదేశమునకు స్వరాజ్యం లభించింది. కాని భారతదేశము ఖండింపబడుటచే విస్తీర్ణము తగ్గినది. దాస్యశృంఖలములు ఛేదింపబడ్డాయి. కాని ఆ ఛేదనలో మన భూగర్భానికే అపాయము వాటిల్లింది. తూర్పున బెంగాలులో ఒకభాగము, అస్సాములో సిల్హెట్ జిల్లా, పడమట పంజాబులో ఒకభాగము, సింధు, బెలూచి, పఠాను రాష్ట్రములు మన అఖండ భారత భూమినుండి ఖండింపబడి అన్యాక్రాంతాలుగా వేరుచేయబడ్డాయి. స్వాతంత్ర్య పోరాటమునకు జీవగీతికమైన జన గణ మన అధినాయక జయహేలో పంజాబ్, సింధు, మహారాట్టా, ఉత్కళ, వంగ అనేచరణం పూర్తిగా పాడడానికిగాని, నమో హిందూస్థాన్, సకలకంఠ సకలభాష హిందూస్థాన్ అని యెలుగెత్తి మన ఐక్యతను చాటడానికిగాని వీలులేక పోతోంది. ఈ దారుణమైన పరిస్థితికి ఆంధ్రమహిళ దుఃఖాశ్రువులు విడుస్తోంది.

## సంపాదకీయము

స్వాతంత్ర్యాన్ని సాధించగలిగినందుకు విజయోత్సాహం వెల్లువయై ప్రవహిస్తోంది. భారతభూమి ఖండింపబడినందుకు అమితమైన పరాభవం హృదయాన్ని దహించేస్తోంది. ఈనెల పదిహేనవ తేదీని భారతప్రజ స్వాతంత్ర్యాన్ని ఆనందబాష్పాలతో, అనుతాపాశ్రువులతో స్వీకరిస్తుంది. విడివడ్డ ప్రాంతాలు తిరిగి భారతభూమికి సంక్రమించేవరకూ, జయహే పంజాబు, సింధు, ఉత్కళ, వంగ, పఠాన్, బెలూచి, ద్రవిడ, మహారాటా అనే పూర్తి పాఠానికి మనకధికారం కలిగేటంతవరకూ యీ అనుతాపాశ్రువులు ఆరవు. అంతవరకూ స్వాతంత్ర్యపోరాటం జరుగుతూనేవుంటుంది.

---

## దేవదాసీపద్ధతి నిషేధించే బిల్లు

మద్రాసు రాష్ట్రానికి చెందిన దేవాలయాలలోని దేవదాసీల పద్ధతిని నిషేధిస్తూ, ఆగస్టునెలలో సమావేశంకానున్న మద్రాసు అసెంబ్లీలో ప్రభుత్వంవారు ప్రవేశపెట్టబోయే దేవదాసీలపద్ధతిని నిషేధించే బిల్లు ఫోర్టు సెంట్ జార్జి గెజెట్‌లో ప్రకటితమైంది. ఆ ప్రకటన బట్టి బిల్లు ఉద్దేశాలు యీ క్రింది విధంగా తెలియవస్తున్నాయి :

(1) ఎన్నో దేవాలయాలలోను, మతసంస్థలలోను, హిందూదేవతలను ఆరాధించడానికి దేవదాసీలనే పేరుతో స్త్రీలను కొందరిని నియమించడం జరుగుతోంది. దీనివల్ల స్త్రీలు చాలమంది జారిణులుగా మారిపోవడం సంభవిస్తోంది. ఈ దేవదాసీల నియామకం యిక మీదట సహించరాదని అనేకుల అభిప్రాయమైవుంది. ఇంతేకాక, దేవదాసీలే చాలమంది తమకష్టాలను ప్రభుత్వానికి మొరపెట్టుకుంటున్నారు.

(2) దేవదాసీలను నియమించడం నిషేధిస్తూ, బొంబాయి ప్రభుత్వంవారు 1934 లో చేసిన బొంబాయి దేవదాసీల రక్షణచట్టాన్నిపట్టి 1938 లో శ్రీమతి అమ్మనరాజాగారు మద్రాసు అసెంబ్లీలో బిల్లునొకటి ప్రవేశపెట్టారు. దీనిని సెలెక్టు కమిటీవారు పరిశీలించి తమ నివేదికనుకూడా సిద్ధంచేశారు. కాని యీలోపున మంత్రివర్గం రాజీనామా పెట్టడం వల్ల ఆబిల్లు అసెంబ్లీలో ఆమోదించడం జరగలేదు.

(3) 1938 లో సెలెక్టు కమిటీవారు మార్పులు చేసిన దేవదాసీ విధానం రద్దుబిల్లును పట్టి ప్రభుత్వంవారు యిప్పుడు యింకొక బిల్లును తయారుచేశారు. ఈ బిల్లు ప్రకారం దేవదాసీలను నియమించడం నిషేధింపబడుతుంది. పదహారేళ్ళుగాని, అంతకుపైబడిగాని వయస్సున్నవారిని దేవదాసీలుగా నియమించినా, అటువంటి నియామకం అంగీకరించినా, అందులో పాలుతీసుకున్నా యీబిల్లుప్రకారం శిక్షార్హులవుతారు. అట్టివారికి ఆరునెలల ఖైదుగాని, 500 రూపాయల జుల్మానా గాని, లేకపోతే రెండు విధాలాగాని శిక్షవేయవచ్చును.

★

# దూరసీమల నారీప్రపంచం

ఆస్ట్రేలియా

మన దేశంలో స్త్రీపురుష కార్మికులకు సమానమైన వేతనాలు లేవు. పురుషుడు పదిరూపాయిలు సంపాదిస్తే, ఆ పనికే స్త్రీకి మూడు రూపాయిలేనా యివ్వడానికి సందేహిస్తారు. ఎందుచేత? ఈ పరిస్థితి ఆస్ట్రేలియాలో యింత అధ్వాన్నంగా లేదు. పురుషునికి పదిరూపాయిలు జీతమైతే స్త్రీకి తొమ్మిదిరూపాయిలు, అనగా 100 కి 90 వంతున జీతాలు, కూలి నిర్ణయించారు. శాసనసభా సభ్యత్వం విషయంలో మన దేశమే మెరుగులా కనిపిస్తోంది. ఆస్ట్రేలియా సెనేట్‌లో (మన స్టేట్ కౌన్సిల్ వంటిది) ఒకరు, హౌస్ ఆఫ్ రిప్రిజెంటేటివ్స్ (మన కేంద్రశాసన సభ వంటిది)లో ఒకరు మాత్రమే సభ్యురాండ్రుగా వున్నారు.

ఈజిప్టు

పురుషులకు ఓటు అధికారంవుంది. కాని స్త్రీలకు యీ ప్రాథమిక హక్కు యింకా ప్రసాదింపబడలేదు!

ఫిన్‌లాండ్

పార్లమెంటులో 18 గురు స్త్రీలు సభ్యురాండ్రుగా వున్నారు. కాని, మంత్రిణిగా యింతవరకెవ్వరూ నియమింపబడలేదు. అఖిల ఫిన్‌లాండ్ రేడియోకు డైరెక్టరుగా ఒకస్త్రీ ఆధ్వర్యం వహిస్తోంది.

ఫ్రాన్సు

ఈ మధ్యనే స్త్రీలకు ఓటు హక్కు యివ్వబడింది. ప్రజాస్వాతంత్ర్యోద్యమానికి పుట్టినిల్లని చెప్పదగ్గ యీ నాగరిక దేశంలో యింతకాలం స్త్రీలకు వోటింగు అధికారం లేదన్నమాట!

ఇంగ్లండు

పార్లమెంటులో 24 గురు సభ్యురాండ్రుగా వున్నారు. ఈ మధ్యనే స్వర్గస్థురాలైన విల్కిన్‌సన్ కన్య విద్యాశాఖకు మంత్రిగావుండేది. ఇద్దరు పార్లమెంటరీ కార్యదర్శినులుగా పనిచేస్తున్నారు.

నార్వే

పార్లమెంటులో ఎనమండుగురు సభ్యురాండ్రు; ఒక ఆమె మంత్రిణి.

స్వీడన్

ప్రభుత్వశాఖ లన్నిటిలోను స్త్రీలు వుద్యోగాలు చేస్తున్నారు. పోలీసు, మిలిటరీ శాఖలకు గూడా వారు అర్హులని ప్రభుత్వం గుర్తించింది. చర్చికి సంబంధించిన వుద్యోగాలకు మటుకు స్త్రీలు అనర్హులట!

ఆఫీసులలోను, కర్మాగారాలలోను స్త్రీలు గూడ పనిచేసి సంఘ సౌభాగ్యానికి తోడ్పడుటకు వీలయేందుకు, గృహ నిర్వహణకు అంతరాయం కలుగకుండా వుండేందుకు, ప్రభుత్వం తన ఖర్చుపైనే కుటుంబ సహాయ కేంద్రాలను (హోమ్ హెల్ప్ సర్వీస్), శిశుసంరక్షణాలయాలను, శిశువిహారాలను నిర్వహిస్తోంది. పార్లమెంటులో 230 సభ్యులున్నారు. వారిలో 17 గురు స్త్రీలు.

—"రోషిణి"కి కృతజ్ఞతతో




౧

మహాత్మా! నా సుశీల జీవననౌకను నడిపేభారం మీ కప్పగిస్తున్నాను. ఈ దుఃఖినికి శాంతి లభ్యంకావాలంటే మీ అనుగ్రహం తప్ప వేరే సాధనం లేదు. నాయేకమాత్ర పుత్రికను నేను సంరక్షించుకోడానికి తగను. మీ ఆశ్రమంలో అప్పగించడంతప్ప నాకు గత్యంతరం లేదు. మహాత్మా! మీరొకప్పుడు నాకు మిత్రులు. నా జీవితంలో మీకు తెలియందేమీలేదు. మీరు మహానుభావులు. మీ జీవితంలో ఆశ్చర్యజనకమైన మార్పు వచ్చింది. మీరు తపస్వులు. కాని నేను యిరవైసంవత్సరాలకు పూర్వం యెట్లున్నానో యిప్పుడు సరిగా అట్లే ఉన్నాను. అయితే నా బిడ్డకు వైధవ్యం ప్రాప్తించినప్పటినుండి నా దుర్వ్యసనాలు నన్ను నరకబాధకు గురిచేస్తున్నాయి. మహాత్మా! నేను మహానీచుణ్ణి, పాపాత్ముణ్ణి, దుర్మార్గుణ్ణి, వ్యభిచారిని. కాని నా సుశీల దేవీమూర్తి, లక్ష్మీపవిత్ర, పతివ్రతామతల్లి. గురుదేవా! నా తల్లిని అనుగ్రహించండి. నా దురభ్యాసాల ప్రభావంపడి ఆమె నిర్మల మనస్సు ఎక్కడ పాడైపోతుందో అని నేను భయపడుతున్నాను. ఆ పసిబిడ్డకింకా ప్రపంచమంటె పూర్తిగా తెలియదు. ఆమెకు కవిత్వధోరణి ఉంది- ఏదో తనలోకం తనదిగా కాలం గడుపుతోంటుంది. కాని నవయౌవనం పొంగిపొరలేసమయానికి పాపభూయిష్ఠమైన యీ ప్రపంచంతో పరిచయంకాకమానదు. భగవాన్! ఆమె పరిశుద్ధత కాపాడండి! నా బిడ్డ విగతభర్తృక. ఈ పతితుడు తన బిడ్డ ఆత్మోన్నతి అభిలషిస్తున్నాడు. దేవతవంటి నా పుత్రిక దేవతవలెనే ఉండాలని నాతుదికోరిక. మన్నించండి, మహానుభావా!

౨

మహాత్ముడొకప్పుడు బారిష్టర్. ఆయన భార్య అవసాన సమయంలో, "మీరు మళ్లీ వివాహం చేసుకోరాదు. చేసుకుంటే నా బిడ్డలు దుర్గతిపాలవుతారు. సవతితల్లి నా బిడ్డల్ని ప్రేమతో చూడ్డానికి బదులు—" అని చెబుతూ ఉండగానే మృత్యుదేవత ఆమెను తీసుకొని వెళ్లిపోయింది. ఆ అసంపూర్ణ వాక్యాలే బారిష్టర్ దీక్షిత్ హృదయంలో బాగా నాటుకుపోయాయి. లక్ష్మీదేవి మూతలుపడ్డ కళ్లు, పడిపోతూన్నమాట ఆయన హృదయం కలచివేశాయి. అనేకకష్టాలు అనుభవించవలసివచ్చినా బారిష్టర్ మళ్లీ వివాహం చేసుకోలేదు. ఆరోజునుండి పిల్లల్ని పెంచుకోడం, భార్య పటానికి పూజచెయ్యడం ఆయన నిత్యకార్యక్రమమైంది. భార్య పోయేడప్పటికి బారిష్టర్ పూర్ణ యౌవనుడు. మనస్సులో యెప్పుడూ దేవాసురయుద్ధం తీవ్రంగా జరుగుతూనే ఉండేది; ఎన్నిసార్లో రాక్షస ప్రవృత్తులు జయజయధ్వానాలు చెయ్యడానికి సంసిద్ధమయాయి. కాని అన్నిసార్లు మృత్యుశయ్యమీది లక్ష్మీదేవి కళ్లు, మాటలే ఆయన్ని కాచుకుంటూ వచ్చాయి. స్త్రీజాతి కెల్లప్పుడూ దూరంగా ఉండడాని కాయన స్థిరపరుచుకున్నాడు. ఆయనకి కొంత

---

మాతృక: పిక్‌నిక్ (హిందీ): శ్రీమతి కమలాచౌదరి
అనుసరణ : శ్రీమతి బె. కృష్ణవేణమ్మ విశారదగారు

మంది మిత్రుల పత్నులతో పరిచయం ఉండేది. భార్య చని పోయాక ఆస్త్రీలు బారిష్టరుమీద సహానుభూతితో బిడ్డల్ని పెంచడంలో సహాయపడ్డారుకూడా. కాని వాళ్ల సహానుభూతిని కొంచమైనా సరకుచెయ్యకుండా ఆయన వాళ్లని చూడ్డంకూడా మానివేశాడు. ఇప్పుడాయన తన వాతావరణంలో స్త్రీ అనే పేరు ప్రవేశించడానికికూడా ఇష్టపడటం లేదు.

3

బారిష్టర్ దీక్షిత్ అంత కఠోరంగా తన మనస్సును శాసి స్తోన్నప్పటికీ అది నిలకడగామాత్రం ఉండటం లేదు. అను క్షణం మనస్సులో ఉత్పన్నమయే భావాలతో ఘోర సంఘర్షణ జరుగుతూనే ఉండేది. ఏదోవిధంగా పగలంతా వేరువేరువ్యాపకాలతో మనస్సు విరామంలేకుండా ఉండేది. రాత్రిపూట గీతాపఠనంతో నిద్రాదేవిని ఆహ్వా నించేవాడు. అయినప్పటికీ కలల్లో మాత్రం ఎక్కువకాలం హాసవిలాసాల ఆకర్షణలో కొట్టుకుపోయేవాడు. వకీలు శ్యామాచరణుని యింట విందు, కైలాసవిహారీభార్యరాగిణి శృంగారించుకుని తనముందు! బారిష్టర్ ఆఫీసులో లా బుక్కులు తిరగవేస్తున్నాడు. బైట వరండాలో తోటివకీలు తన గుమాస్తాతో గుసగుసలాడుతున్నాడు. ఆ గుసగుస లతో ఆయన ఏకాగ్రత చెదరిపోయింది. దృష్టి ఎదురు గుండా ఉన్న భార్య ఛాయాచిత్రంమీదికి పరిగెత్తింది. ఇంతలో ఒక భర్తృహీన శ్వేతవస్త్రాలు ధరించి వస్తోంది. మగని ఆస్తి యితరులు కాజేశారని వ్యాజ్యెం వెయ్యడానికి వస్తోంది కాబోలు. ఆ కాలిచప్పుడే ఆమె స్త్రీ అని తెలియ జేస్తోంది. గుమాస్తాతో చెప్పుకోమంటాడు. తాను మాత్రం యీ కేసు జోలికిపోడు. గదిలోకి గుమాస్తా వచ్చాడు. ఆయన ఆలోచనాప్రవాహానికి అంతరాయం కలిగింది. గుమాస్తా ఆమె వ్యాజ్యెంవిషయం చెప్పడానికి వచ్చి నట్టుంది. స్త్రీకి సంబంధించిన వ్యాజ్యెం! ఏం వినవలసి వస్తుందోకదా! హృదయం కంపించడం మొదలుపెట్టింది. కాని గుమాస్తా చెప్పిందేమిటి? చర్మిలాల్ అనే వకీలు వచ్చాడుట! బారిష్టరు సిగ్గు వర్ణించడానికి వీల్లేదు. తన ఊహా ప్రపంచానికెంత బానిస అయిపోయాడు! ఇదివర కెన్నడూలేని దుర్బలస్థితి వచ్చింది తన మనస్సుకి. జయించా ననుకున్న కోరికలే తన్నింత కోతపెడుతున్నాయి. భగవం తుడా, ఇంకేది దిక్కు?

౪

బిడ్డల బాధ్యత వదల్చుకొని బారిష్టర్ దీక్షిత్ సన్యాసం స్వీకరించాడు. పిమ్మట హిమాలయాల్లో పరిభ్రమిస్తూంటే అక్కడ ఒకయోగిపుంగవుని శిష్యరికం లభించింది. ఆ యోగిపుంగవు డొకదివ్యపురుషుడు. ప్రాపంచికసంబంధం రోసి, భయంకరాటవులుపట్టి, దుర్గమపర్వతాలు తిరిగి, ఘోరతపశ్చర్య సాగించి, తన సాధన సఫలీకృతం కావించు కొన్న ధన్యాత్ముడు. ఇప్పుడు తన దివ్యసంపత్తిని మానవ సమాజక్షేమానికి వినియోగపరిచే ఉద్దేశంతో యీ ప్రాంతా లకు వచ్చాడు. దారిగానక కొట్టుకొంటూన్న దాసజనులను దరిజేర్చే నిమిత్తమొకఆశ్రమం, దానితోపాటు దరిద్రుల కొక ధర్మ వైద్యశాల నెలకొల్పాలని ఆయోగివరుని సంకల్పం. తన సంపత్తిలో సగభాగం సమర్పించి, బారిష్టర్ దీక్షిత్ ఆ సత్సంకల్పం కొనసాగించాడు; తాను యోగీశ్వరుని సాన్నిధ్యంలో ఉండిపోయాడు. ఆ దివ్యపురుషుని అను గ్రహంవల్ల బారిష్టరుకు పరిపూర్ణమైన శాంతి దొరికింది. స్వల్పకాలంలో తనుకూడా కఠిననియమపాలనవల్ల, కఠోరతపశ్చర్యవల్ల మహాతపస్వి కాగలిగాడు. యోగిసత్తముని శిష్యకోటిలో అతిముఖ్యుడనిపించుకొన్నాడు. అతని ఖ్యాతి నలుగడల వ్యాపించింది. బారిష్టరు నందరు యోగితో సమా నంగా చూడసాగారు. యోగీంద్రుడు సిద్ధిపొందినంతనే ఆశ్రమవాసులందరు బారిష్టరే గురుదేవపదాని కర్హుడన్నా రు. ఆనాటినుండే అతని కాపదవికూడా లభించింది. అత డంతటితో బారిష్టర్ అవతారం చాలించి, ఒక ప్రసిద్ధ మహాత్ముడయాడు.

౫

మహాత్ముని శిష్యుడు శేఖర్ మెల్లిగా స్నానంచేసి వస్తు నాడు. దూరనుంచి అతగానికి తెల్లని చలవరాతి విగ్రహంలా కనిపించింది. ఆశ్రమం మెట్లమీద ఆగిపోయాడు. ఎవరో దుఃఖిని విలపిస్తోందని తెలుసుకున్నాడు. ఎవరమ్మా, ఏడు స్తున్నావెందుకూ? నే నేదైనా చెయ్యగలనా? సుశీల

పురుషసాంగత్యం ఎన్నడూ ఎరగదు. కాని ఆమె స్వభావం నిర్భయమైంది. చిన్నపిల్లలా కన్నీరు తుడుచుకుంది. మీరు మహాత్ముని పుత్రులా? శేఖర్ జాలిపడ్డాడు. నేను మహాత్ముని శిష్యుణ్ణి. నన్ను వారు పుత్రవాత్సల్యంతో చూస్తారు. సుశీల నిట్టూర్చింది. అయితే మీ వల్ల నేమీకాదు. ఈ ఆశ్రమవాసులే మీరు. శేఖర్ నవ్వాడు. ఆశ్రమవాసినైతే నేం? కొంచెం చెప్పు! నేను చెయ్యగలిగింది చేస్తాను. సుశీల క్షణ మాలోచించింది. తన విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది. నా తండ్రితో కొంచెం చెప్పగలరా? ఈ ఆశ్రమంలోవుంటే నాకు శుభ మవుతుందని ఆయన తలంపు. శేఖ రెంతో స్నేహంగా మాట్లాడాడు. ఆమె తండ్రిని పూర్తిగా సమర్థించాడు. కొన్నాళ్లక్కడవుండి చూడమన్నాడు. ఇష్టంలేకపోతే తిరిగి వెళ్లిపోవచ్చునన్నాడు. అక్కడ ఏవిధమైన బంధనలూవుండవు. స్వతంత్రంగావుండవచ్చు. ఇష్టానుసారం కవిత్వం చెప్పుకోవచ్చు. పూల తోటల్లో కాలక్షేపంచెయ్యవచ్చు. చదువుకోడాని కెన్నో సదుపాయాలున్నాయి. చిత్రకళ, వైద్యం, సంగీతం-అన్నీ నేర్చుకోవచ్చు. శేఖరుకూడా కవిట. సుశీల అమ్మయ్య అనుకుంది. ఇక్కడ తనకు సహానుభూతి దొరుకుతుంది. శేఖర్ మాటల్లో ఏదో మంత్రంవుంది. సుశీల ఆశ్రమంలో ఉంటున్నానంది. తండ్రి తొందరతొందరగా వచ్చాడక్కడికి. ఆమె నప్పుడప్పుడు వచ్చి చూస్తోంటానన్నాడు. వెళ్లిపోయాడు.

౭

"సుశీలా! నాకు గురుదేవు లొక నెలపాటు కొండగుహల్లో ఏకాంతవాసం శాసించారు."

..............................

"సుశీలా! కన్నీ రెందుకు? కంపమెందుకు?"

"శేఖర్! నీవు వెళ్లిపోతే నే నెంతమాత్రం యిక్కడ వుండలేను. నన్ను నా తండ్రి దగ్గరికి పంపించివెయ్యి."

"కాదు, సుశీలా! ఇన్ని రోజుల దీక్షా వమ్ముకానియ్యకు. గురుదేవుల్ని నీ కెక్కువ సమయం యిస్తూండమని ప్రార్థిస్తా. ఆయన ఉపదేశాలు నీకు శాంతి నివ్వగలవు."

"వద్దు, శేఖర్! గురువుగారిని నాకూ ఏకాంతవాసం విధించమను!"

"గురుదేవు లందు కొప్పుకోరు. నీ విప్పుడే అంతటి కఠోరనియమాలకి తాళలేవు."

"ఐతే నే నిక్కడవుండను. శేఖర్, నన్ను మన్నించు. గురుదేవులంటే నా కొక విధమైన భయం కలుగుతోంది. వారికంటె నాకు నీయందు ఎక్కువగా—"

మాట పూర్తికాకుండగానే అడ్డుతగిలి, శేఖర్ ఆమెను మందలించాడు. గురుదేవులయందు భక్తికలిగి ఉండమన్నాడు.

"శేఖర్...ఎన్నోసార్లు వారు మన మాటలు పొంచి వింటూండడం కళ్లారా చూశాను."

"అందులో తప్పేముంది? మఃల్ని కనిపెట్టివుండడం వారి కర్తవ్యం."

"ఇంతే కాదు, శేఖర్! రాత్రుళ్లు కొన్నిసార్లు నన్నెవరో కిటికీసందుల్లోంచి తొంగిచూస్తున్నట్లయేది. నువ్వు వ్రాసిచ్చిన నీ పటం నా గదిలోంచి ఎవరో దొంగిలించుకుపోయారు... ఈ పనులన్నీ ఎవరివో నాకు సందేహంలేదు-శేఖర్, నువ్వులేకుండా నే నిక్కడ ఒక్కక్షణం ఉండలేను. లేకపోతే కొన్ని రోజులుండి వెళ్లకూడదా నువ్వు?" సుశీల వెక్కి వెక్కి ఏడ్వనారంభించింది.

౮

గురుదేవులు మనోరంజకమైన స్వప్నం కంటున్నారు: విజనమైన బృందావన విపినమంతా వెన్నెల వెల్లువలు. వెన్నెట్లో వెలిగిపోతూ కృష్ణభగవానుడు! నృత్యం జేస్తున్నాడు. కుడిచేతిలో మురళిక, ఎడమప్రక్క రాధిక! దేవతాకోటిలో గురుదేవులుకూడా ఉన్నారు. పైని విమానంలోంచి పుష్పవృష్టి కురిపిస్తున్నారు. భక్తవత్సలుడైన కృష్ణభగవానుడు మురళిపైకెత్తి గురుదేవుని తన దగ్గరకు రమ్మని సంజ్ఞచేశాడు. భక్త్యున్మాదంలో గురుదేవుడు విమానంలోంచి దుమికాడు. భగవంతుడు గురువర్యుని తనలో లీనం జేసుకున్నాడు. తరవాత మురళీమనోహరుడు రాధికారమణిని చూసి, "ప్రియా! భూమిమీద నువ్వు సుశీలగాను నేను మహాత్మునిగాను ఉండివచ్చాం. ఇప్పుడు మళ్లీ ఒకమాటు మర్త్యలోకానికి వెళ్లి ప్రాణికోటిని ఉద్ధరింపవలసివుంది." అని అంటూ ప్రచండవేగంతో నృత్యం చెయ్య

సారంభించాడు. రాసలీల సమాప్తికాగానే, రాధారమణిని వెంట బెట్టుకుని తిరిగి భూలోకానికి చక్కావచ్చాడు.

"ప్రాణేశ్వరా! ఇప్పుడే మళ్లీనాకు వేరుపడి ఉండవలసి వుందా? ఈసారి వియోగం సీతావనవాసాన్ని మించి పోయింది, దేవా!" అంది రాధిక.

"లేదు ప్రియా! ఈ మాటు మన మిద్దరమూ కలిసివుండే ప్రపంచోద్ధరణచేద్దాం" అని కృష్ణుడామెను ఆలింగనం చేసు కున్నాడు...

నిద్రమేల్కొనికూడా గురుదేవునకు స్పృహరాలేదు. ఉన్మత్తునివలె, అక్కడ వేచివున్న సుశీల చెయ్యి పట్టుకుని "ప్రియా, రాధికా!" అంటూ ప్రలాపింపజొచ్చాడు.

సుశీల ఆచేతిని విడిపించుకుని "శేఖర్! రక్షించు" అని అరుస్తూ పరిగెత్తింది.

❊ ❊ ❊

తండ్రిని కౌగిలించుకొని సుశీల గోలుగోలున యేడ్చింది. అంతిమ సమయానికి నా దగ్గరకు వచ్చావా తల్లీ అంటూ నెత్తురు కక్కుకున్నాడతను. శేఖర్ అతనికి వుపచారంచెయ్య సాగాడు. నన్ను దూరంగా పంపించివేసి యెంతదుస్థితి తెచ్చుకున్నావు తండ్రీ అని సుశీల విలపించింది. ఇంతలో నాకరు శేఖర్‌పేర ఒక వుత్తరం తెచ్చియిచ్చాడు.

"శేఖర్, సుశీల నాకు జ్ఞానోదయం చేసింది. నా భ్రమతొలగింది. నేనిన్నాళ్లు స్వప్నమనుకుంటూ వచ్చినది సత్యమైంది; సత్యమని భ్రమపడినది స్వప్నమని తెలిసింది. నాకు మార్గమిప్పుడు దృగ్గోచరమైంది. నేను వెళుతున్నాను. ఈ ఆశ్రమం కొనసాగించేభారం మీమీద విడిచిపెడుతున్నాను. నీవు సుశీలను వివాహం చేసుకో. మీకు శుభమవుతుంది. మానవప్రేమద్వారానే మీరు దివ్యప్రేమను సాధించగల్గుతారు. ప్రవృత్తుల్ని అణచిపెట్టడంవల్ల లాభం లేదు. ఆధ్యాత్మికంగా వాటిని మళ్లించినప్పుడే వాస్తవమయిన శాంతి లభించగలదు. ఇదే నా అంతిమ ఉపదేశం.





వయోజన స్త్రీ సంఘము, వాల్తేరు
ఆర్. కామేశ్వరి-ప్రెసిడెంటు :: ఎస్. కామేశ్వరి-సెక్రటరి
(నడుమ హారములతో కూర్చున్నవారు)

## వయోజన స్త్రీ సంఘము, వాల్తేరు

ఈ సంఘమును, "వయోజన స్త్రీసంఘ"మను పేరుతో 1945 జూన్ 9 వ తేదీని స్థాపించాము. అప్పుడు శ్రీ ఆర్. కామేశ్వరిని అధ్యక్షురాలిగాను, ఎస్. కామేశ్వరిని కార్య దర్శినిగాను నియమించుకున్నాము.

పై సంఘము నిత్యము కలుసుకొనుటకై "శారదా విద్యా నిలయ"మను ఒక చిన్న ఎలిమెంటరీ గ్రాంటు స్కూలునందు, శ్రీ చీమలపాటి గణేశ్వరరావుగారిద్వారా, స్కూలు మేనేజరుగారివద్ద అనుమతిపొంది, గృహప్రవే శమై సంఘాభివృద్ధికి మొదలుపెట్టేము.

ఇచ్చట రోజూ సాయంత్రం, 4½ గం|| నుండి 6 లేక 7 గంటలవరకు కలుసుకుంటున్నాము. ఇప్పుడు సంఘ సభ్యుల మొత్తము సంఖ్య సుమారు ౭౭ వైవరకు ఉంది. దీనిలో 5 సం|| నుండి 25 సం|| వరకు వయస్సున్నవారు మెంబర్లుగా ఉండవచ్చును.

సంఘ గ్రంథాలయమునకు శ్రీ వేపా పూర్ణయ్యగారు మరికొందరు మిత్రులు పుస్తకములను దయతో నుచితముగా నొసగిరి. మేముగూడ కొంతధనమును వెచ్చించి చాల పుస్తకములను కొన్నాము.

నాట్యమొక గొప్పకళ. ఆకళ నారాధించువారి సంఖ్య ఇటీవల వరకును చాల తక్కువగా నుండెను. ఇప్పుడిప్పుడే దానినభివృద్ధిచేసి ప్రచారము చేయుటకై స్త్రీ పురుషులు పలువురు ప్రయత్నించుచున్నారు. మేమును చిన్నిపిల్లలకు ఒకవిధమైన నాట్యము నేర్పుతున్నాము. ఇది శాస్త్రీయ మైన భరతనాట్యమనికాని, మరోనాట్యమనికాని చెప్ప లేము. కాని భావానుగుణమై చూచువారి కానందదాయక ముగా నుండుననిమాత్రం చెప్పగలము. నాట్యం నేర్పు

## ఆంధ్ర మహిళా లోకము

కోవడ మెంతకష్టమో నేర్పడంకూడా అంతే. క్రమక్రమంగా ఈ విషయంలో శాస్త్రీయపద్ధతులనే అవలంబించడానికి ప్రయత్నం చేస్తాము.

మా సంఘంలో వారానికొకమాటు వాగ్వివాదసభలు నిర్వహిస్తున్నాము. సభ్యురాండ్రు పెక్కురుత్సాహముతో పాల్గొని తమ యభిప్రాయాలను స్వేచ్ఛగా వెల్లడించడం నేర్చుకుంటున్నారు. హిందీ క్లాసులు పెట్టి కొంతమంది పిల్లలను పరీక్షలకు తరిఫీదు చేస్తున్నాము.

Mrs. A. V. N. కళాశాలలో చరిత్రోపాధ్యాయులుగా పనిచేసి అకాలమరణమునకు గురియైన శ్రీ మోడేకుర్తి కామేశ్వరరావు M. A. L. T. గారి నిధికి మేము కొంత సొమ్ము వసూలుచేసి వారి కుటుంబమునకుపంపి మా ఉడుతాభక్తి చూపాము.

ఆంధ్ర నవలా రచయితలలో నగ్రేసరులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు దివంగతులైనపుడు సానుభూతిసభ నేర్పాటుచేసి వారి ప్రతిభా పాండిత్యములను గూర్చి పెద్దలచే నుపన్యాసము లిప్పించినాము.

శ్రీ ఆకెళ్ల సూర్యనారాయణ మహిళాభవనములో శ్రీరామనవమి ఉత్సవములు జరిపినపుడు మేమచ్చటికేగి ఒక చిన్న ప్రదర్శన మొసంగియుంటిమి. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు, ఆరోగ్యమంత్రిగా నీయూరి కరుదెంచినపుడు జరిగిన సభలో మేముకూడ తగినరీతిని పాల్గొంటిమి.

జరిగిన సంవత్సరములో మేమొకసారి దువ్వాడయును, ఒకసారి సింహాచలమునకును బహిర్విహారమున కరిగితిమి. సభ్యురాండ్రు పలువురు పాల్గొనుటచే నా ప్రయాణము మిక్కిలి యుత్సాహకరముగా నుండెను.

సంఘము స్థాపించిన పిమ్మట మూడునెలల కొకసారియు, ఆంగ్లసంవత్సరాదినాడును పట్టణమునందలి పెద్దల నాహ్వానించి సభచేసి పిల్లలచే వివిధములైన ప్రదర్శనములు యిప్పించితిమి.

మా సంఘములో విజ్ఞానప్రదములైన పై విషయాలతోపాటు వ్యాయామసంబంధములైన గృహాంతర క్రీడలుకూడ కొన్ని ఏర్పాటుచేసినాము. శ్రీమతి చీమలపాటి సూర్యమహాలక్ష్మమ్మగారు కేరమ్సుబోర్డు, శ్రీ సగ్గస్వతుల సుందరరావు పంతులుగారు బెగిటిల్ బోర్డు సంఘమునకు బహుమానము చేసిరి. శ్రీ ముక్కా అప్పలస్వామినాయుడుగారు సంఘమునకు ఒక బీరువా నొసంగిరి.

శారదా విద్యానిలయం మేనేజరుగారికి మా కృతజ్ఞత తెలుపుచున్నాము.

మా సంఘముయొక్క అభివృద్ధికై వివిధ విషయములలో తోడ్పడిన శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, కీ|| శే|| శ్రీ మోడేకుర్తి కామేశ్వరరావుగారు, తదితర యుదారులకు మేమెంతయు కృతజ్ఞతాభినందనము లర్పించవలసియున్నది. శ్రీమతి చీమలపాటి సూర్య మహాలక్ష్మమ్మగారు సంఘమున కొనరించిన యుపకార మింతింతకాదు. ఆమెయెడమా సంఘసభ్యులందరును ప్రత్యేకముగా కృతజ్ఞులమై యుండవలయును.

## శ్రీకాకుళం లేడీస్ క్లబ్, శ్రీకాకుళం

జూన్ నెల 23 వ తేదీన, శ్రీకాకుళం లేడీస్ క్లబ్ 9 వ వార్షికోత్సవము, లేడీస్ క్లబ్ ఆవరణలో అతి వైభవముగా జరుప బడింది. ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘ అధ్యక్షురాలు డాక్టరు కొ. అచ్చమాంబగారు యల్. ఆర్. సి. పి. యస్. అధ్యక్షత వహించిరి.

ప్రత్యేకముగా నిర్మింపబడిన పందిరియంతయు స్త్రీలతో నిండిపోయెను. సుమారు యేడువందల మంది స్త్రీలు సభకు హాజరయిరి. దీర్ఘమైన వైజ్ఞానిక కార్యక్రమముతో "ముందంజ" అను పేరుగల ఏకాంకిక మిక్కిలి నైపుణ్యముతో ప్రదర్శింపబడెను.

క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి మ. లక్ష్మీ నరసమ్మ గారు సభికులకు డాక్టరు అచ్చమాంబగారిని పరిచయము చేసిరి. డాక్టరు అచ్చమాంబగారు తమ అధ్యక్షోపన్యాసములో స్త్రీల నెదుర్కొనుచున్న సమస్యలను గూర్చియు, వీటికిని దేశమును ఎదుర్కొనుచున్న క్లిష్ట సమస్యలకును గల దగ్గర సంబంధమును గూర్చియు వివరముగా జెప్పిరి. రష్యా,

యుగోస్లావియా, చైనా దేశముల నుదాహరణముగా తీసి కొని, సర్వవిధముల స్వతంత్రమయిన దేశములలో స్త్రీలేవిధముగా ముందుకు వచ్చిరో తెలియజేసిరి. భారత దేశంలో మహిళోద్యమము ఎట్లు అభివృద్ధి చెందినదో తెల్పిరి. మొట్ట మొదట అఖిల భారత మహిళాసభ ధనిక స్త్రీల సంస్థగా ప్రారంభమయి క్రమముగా అన్ని తరగతుల స్త్రీలకు ప్రాతినిధ్యము వహించుచు ప్రస్తుత మేవిధముగా భారత స్త్రీల హక్కులకై పోరాడు ఏకైక మహిళాసంస్థగా మారినదో తెల్పిరి. ఒక దేశము యొక్క నాగరకతగాని విజ్ఞానముగాని తెలుసుకోవాలంటే ఆదేశములోని మహిళల పరిస్థితి, వారి హక్కులను పరిశీలించిన చాలునని చెప్పిరి. ఏదేశమయినను సాంఘికముగా, రాజకీయముగా, ఆర్థికముగా, విజ్ఞానములో నైనను అభివృద్ధి పొందవలెనంటే ఆదేశములోని స్త్రీలు ఆర్థిక స్వాతంత్ర్యము గలిగియుండుట అత్యవసరమని తెల్పిరి. ప్రపంచ మహిళా ఉద్యమము ఎట్లు క్రమముగా అభివృద్ధి చెందినదో పేర్కొనుచు, ప్రపంచ ప్రజాస్వామిక మహిళల సంఘము (World Federation of Democratic Women) నాయకత్వమున, మిత్రరాజ్య సమితి ద్వారా స్త్రీలు ప్రపంచ ప్రజలకు శాంతి సౌఖ్యములను చేకూర్చుటకుగాను తీవ్రమయిన కృషి చేయుదురని చెప్పిరి. శ్రీకాకుళపుర స్త్రీల నెదుర్కొనుచున్న సమస్యలను తీసికొని వాటిని పరిష్కరించుట ద్వారానే లేడీస్ క్లబ్ అనేకమంది స్త్రీలను క్లబ్‌లోనికి ఆకర్షింప గలదని చెప్పిరి. లేడీస్ క్లబ్ చేయుచున్న కృషికి అభినందించుచు అందరును క్లబ్‌లో చేరవలెనని పురస్త్రీలకు విజ్ఞప్తి చేసిరి.

పిమ్మట శ్రీమతి కె. సుశీలాదేవి గారు "నూతన దృక్పథము" అను తాము రచించిన వ్యాసమును చదివిరి.

తరువాత కార్యదర్శి తమని వేదికను చదివిరి. క్లబ్ గ్రంథాలయ నిధికి 700 రూ. విరాళములు అప్పటికి వసూలు అయినవని తెలియ జేసిరి. స్త్రీల నెదుర్కొనుచున్న సమస్యలను చర్చించుటకయి జరుపబడిన అనేకములగు సమావేశముల లోని విశేషములను తెలియజేసిరి. హిందీ బోధనకు చేయ బడిన ఏర్పాటులను గూర్చియు వ్యాయామము కొరకై క్లబ్ సభ్యులకేర్పరుప బడిన యాటలను గూర్చియు వివిరముగా చెప్పిరి.

అధ్యక్షులు పోటీలలో గెలిచిన వారికి బహుమతుల నొసంగిరి.

క్లబ్‌కు అనుబంధముగా పనిచేయుచున్న బాలసంఘ సభ్యులు రకరకములయిన నాట్యములను నయనానందముగా ప్రదర్శించిరి.

క్లబ్ ఉపాధ్యక్షురాలి వందన వచనములతో ఉత్సవము ముగిసెను.

## కస్తూరిబా మహిళా పాఠశాల, పెద్దాపురం

పెద్దాపురం గ్రామంలో శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మగారి అధ్యక్షత క్రింద కస్తూరిబా మహిళాపాఠశాల తెరువబడి జయప్రదముగా నడుపబడుచున్నది. నలుబది మంది బాలికలు రాట్నము వడుకుట, కుట్లు, అల్లికలలో తర్ఫీదు చేయబడుచున్నారు. శైశవావస్థలోనున్న యీ బడి పెద్దలఆశీర్వచనములకు, ఆర్థికసహాయమునకు యెదురు చూచుచున్నదని సెక్రటరీ గారు సరోజినీదేవిగారు వ్రాయుచున్నారు.



# విద్యావతులకు విజ్ఞప్తి

రష్యాలో భారతరాయబారి శ్రీమతి విజయలక్ష్మీపండిట్

## దేశమాత ప్రీలినహృదయం చేర్చడానికి, దేశంలో చీలినమనస్సులు కలపడానికి తోడ్పడండి

పూర్వం విదేశీయుల దండయాత్రలకు గురియైన ఈ దేశం నాటిదాడులు ఏకజాతిగా ప్రతిఘటించి, తన ఐక్యత కాపాడుకొంది. మన దేశంమీద విరుచుకుపడ్డ ఆ విదేశీయులు యిక్కడ స్థిరంగావుండిపోయి, మనతో ఐక్యమయారు. కాని యీ నాడు మన బలహీనతను, ఐకమత్య శూన్యతను పురస్కరించుకుని పైవాడు దేశం విభజించాడు. ఈ అనవస్థను గురించి దీర్ఘంగా ఆలోచించి, పాతఅప చారాలు పాటించకుండా, సుహృద్భావానికి సౌజ్యన్యానికి నెలవైన నవనవ సమైక్యభారతం మనం నిర్మించవలసిన తరుణం వచ్చింది.

పురుషులు నిర్వహింపవలసిన దానిని మించిన గురుతర కార్యభారం ఈ క్లిష్టసమయంలో భారతమహిళలపైని వుంది. పంజాబు, సింధు, సరిహద్దు ప్రాంతాలకు చెందిన దుఃఖార్తుల భగ్నహృదయాలకు వూరట కల్పించడంలో వారు నిమగ్నలు కావలసివుంది. దీనికి కావలసిన ప్రత్యేక సామర్థ్యం స్త్రీల సొత్తు. నవనవసమైక్యభారతం నిర్మించడం, నూతన సంఘవ్యవస్థ నెలకొల్పడం, దేశీయుల మధ్య సౌహార్దం పెంపొందించడం, జాతిని బలపరచడం మానవతులకే సాధ్యంకావాలి.

విద్యార్థినులు తమ జ్ఞానధనం నిర్మాణకార్యక్రమానికి వినియోగించాలి. మన ప్రజలకి తినకూడు, కట్టగుడ్డ దొరకని దీనస్థితి యింకా తప్పకపోతే, మనకి వచ్చే స్వాతంత్ర్యం నిష్ఫలం. ఈనాడు మనల నెదుర్కొంటూన్న వివిధ సమస్యలు మనం తీర్చుకోకలిగిననాడే భారతస్వాతంత్ర్యం సార్థకమవుతుంది. మతవర్గాలమధ్య శాంతిసామరస్యాలు, సాంఘికపురోభివృద్ధి, విద్యావ్యాప్తి, అభ్యుదయ ప్రాప్తికి శక్తి సామర్థ్యాలనుబట్టి అందరికి అవకాశాలుండుట ప్రస్తుతం అత్యవసరమని ప్రతిస్త్రీ గుర్తించాలి.

నిర్మాణకార్యవిధానాలు ఉపయుక్తంగా వుండేలా చేపట్టి నిర్వహించాలంటే స్త్రీలు ముందు తాము సంఘ దాస్యంనుండి విముక్తిపొందడం ముఖ్యంగా అవసరం. స్వతంత్రభారతంలో సంఘపునర్నిర్మాణమందువారు, స్వాతంత్ర్యపోరాటంలో దేశభక్తి తత్పరలై తాముప్రదర్శించిన దానికంటె యెక్కువగా, ఉత్సాహావేశాలు ప్రదర్శించాలి.

దేశం సమస్తం పరప్రభుత్వంనుండి విడివడడానికి సాగించిన సమరంలో స్త్రీలకు లభించిన ఉచితగౌరవస్థానం గాంధీజీ పెట్టిన భిక్ష.

బ్రిటిషు పార్లమెంటు ఆమోదించే భారతస్వాతంత్ర్యపు బిల్లుతో మనకు స్వాతంత్ర్యం లభ్యమవడంలేదు. ఏ స్వాతంత్ర్యంకోసం మనం యిన్నాళ్లు సతమతమవుతూ వచ్చామో దానిలో ఒక అంశం మాత్రమే మన కిప్పుడీ బిల్లు తెచ్చే స్వాతంత్ర్యం. మనం యిన్నాళ్లు కలలుగన్న విధంగాగాని, మనకు సమ్మతమయే విధంగాగాని దేశస్వాతంత్ర్యం యిప్పుడు చేతికి రావడంలేదు. దేశ విభజనవలన అసంఖ్యాక హృదయాలు దుఃఖంతోటి వేదనతోటి కుమిలిపోతున్నాయి. కాని చలనంలేని ధైర్యం, కర్తవ్యపాలనంలో దీక్ష, త్యాగం తోకూడిన దేశభక్తి వుంటే భారతసమైక్యతను తిరిగి ప్రతిష్ఠించవచ్చు. ప్రపంచమంతా మన చర్యలు శ్రద్ధగా పరికిస్తోంది. కాబట్టి దేశవిభజన మూలాన్ని మనం నీరసం, నిస్పృహ కనబరచకూడదు; భంగమైన సమైక్యతను తిరిగి సమకూర్చుకోడానికనువైన నిర్మాణాత్మక విధానాలకు మనం ఉద్యుక్తులం కావాలి.

బొంబాయి, S.N.D.T. భారతమహిళా విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవ సమయంలో యిచ్చిన స్నాతకోపన్యాస సంగ్రహం.

# చతుశ్శ్లోకేన పండితః

శ్రీమతి దీదువాను బదరీనారాయణమ్మగారు

పద్మనాభశాస్త్రి—చతుశ్శ్లోకేన పండితః— అన్న సూక్త్యనుసారం నాలుగు శ్లోకాలు రావడంతో పరిపూర్ణపండితుడనయ్యానని గర్వించి, వివాహంకూడా అగుటవల్ల—వివాహం విద్యానాశాయ—అని గతసంవత్సరమే గురుకులవాసానికి స్వస్తి చెప్పాడు. ఏకమాత్రపుత్రుడగుటవల్ల తలిదండ్రులుకూడా సరిపెట్టుకోడం తప్ప కూకలేసి ఎరగరు. ఒకనాడు పద్మనాభశాస్త్రి తన పాండిత్యం, విద్యాకౌశలం ప్రదర్శించడంకోసం అత్తవారింటికి బయల్దేర నిశ్చయించాడు. పెంకితనంచేత తలిదండ్రులకేనా తెలపకుండా తెల్లవారుఝామునే ప్రయాణమయ్యాడు. త్రోవలో అతని కొక గార్ధభకళేబరం కంటబడింది. ఆ మృతదేహం చూచేడప్పటికి శ్లోక మొకటి—అనాథప్రేత సంస్కారేణ కోటియజ్ఞఫలం లభేత్ — జ్ఞాపకమొచ్చింది. ఆ గార్ధభం అనాథప్రేత మనడానికి ఏమాత్రం సందేహం కలగలేదు. కనుక, వెంటనే కోటి యజ్ఞఫలాని కాశించి బ్రాహ్మడా శవాన్ని మోసుకొని నడవనారంభించాడు. కాని శీఘ్రమే అతడు నిరాశ పొందవలసి వచ్చింది. బరువు మొయ్యలేక, యజ్ఞఫలం వొదులుకోలేక డోలాందోళమానసంతో దుఃఖిస్తోంటే — సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం—అను శ్లోకం స్ఫురించడంచేత వెంటనే ప్రాణం కుదుటబడింది. అందుకే కాబోలు—కాశీలో కపాలమోక్షమవుతే చాలన్నారు! చిన్ననాటిచదువు చెరుపులేదు అని ధైర్యపడ్డాడు. సూక్ష్మంలో మోక్షం! తలకోసి తగలబెడితే చాలు ననుకున్నాడు. తల నరకడ మెలాగ? ఆయుధమేమీ లేదుకదా! కాని సూక్ష్మబుద్ధి పద్మనాభశాస్త్రికి సులభోపాయాని కేమి లోటు? తాటిమట్ట దగ్గరికివెళ్లి గరికమ్మతో తలనరికి, భుజాలమీద పెట్టుకుని నడవసాగాడు. బారెడుదూరం నడిచేసరికి మళ్లా బరువుతోచింది. భుజం మార్చుకున్నా వల్లకాకపోయింది. అనాథ ప్రేతమని జాలి. బలహీనతచేత నిరాశ. ఇంతలో అతనికి శ్లోకపు ద్వితీయపాదం — సర్వేంద్రియాణాం నయనం ప్రధానం—అని జ్ఞాపకమొచ్చింది. కన్నులేకపోతే కలియుగమే లేదనుకున్నాడు. గాడిద రెండుగుడ్లూ వూడబెరికి తీసుకుని తల వదలిపెట్టాడు. అత్తగారి వూరి పొలిమేర, మిట్టమధ్యాహ్నం. కట్టె లన్వేషిస్తూ తిరిగే పద్మనాభశాస్త్రి కెక్కడా ఎండుపుల్లలుగాని, చెట్లుకాని కనిపించలేదు. వరికుప్పలు—ధాన్యలక్ష్మి తప్ప మరేమీ తెలియరాలేదు. ఒకచోట అన్నంమూటలు విప్పుకొని వరికుప్పచాటున కూలివారు ఆకలితో అన్నపూర్ణను స్వీకరిస్తున్నారు. పద్మనాభశాస్త్రి ప్రజ్ఞ మెచ్చుకోవాలి! వెనకాలేవచ్చి గడ్డికుప్పలో గాడిద గ్రుడ్లుంచి,

కాల్చి పారేసిన చుట్టపీకెతో అంటించాడు. ఆ సంస్కారంతో గాడిద సద్గతి చేరిందని సంబర పడ్డాడు. అంటుకున్న దిచూచి, కూలీలు అన్నాలు వదలి, అగ్గి నార్పడానికి వాళ్ల తంటాలు వాళ్లు పడ్డారు. ఒకరికంటబడకుండా శాస్త్రి ఉడాయించాడు.

వీధి తలుపు తీసేసరికి విఘ్నేశ్వరునివంటి అల్లుడు ప్రత్యక్షం—సరమ్మకి. అల్లుడు వచ్చాడని హడావిడిపడింది. వేన్నీళ్లుకాచింది. వంట చేసింది. వీధి వాకిట్లోకొచ్చి వేన్నీళ్లు స్నానం చెయ్యి నాయనా అంది. అల్లుడు వులకడు పలకడు. అలసివచ్చినట్టున్నాడని ఆట్టే పలకరించ దత్తగారు. అంతలో మన పండితుడికి—ప్రవాహోదకంశ్రేష్ఠం—అన్న శ్లోకం జ్ఞాపకంవచ్చింది. అంగవస్త్రం చేతబుచ్చుకు వెళ్లి ఆ పళంగా పంటకాలవలో పడ్డాడు. ఆ బురదంతా పట్టించుకుని జేగురుగుడ్డల సన్యాసి ఆకారంతో యింటికి వచ్చాడు. వడ్డించిన మృష్టాన్నాలువదలి అక్కడ ఆరబోసిన అరిసెలపిండి చూచి—పిష్టం దష్టగుణంచైవ—అని రాత్రి భోజనానికి అపేక్ష లేకుండా ఆ పిండి బొక్కాడు. అల్లుడు అన్నం విడిచింది చూచి అపరాధమేమో అని అత్తగారు హైరానుపడింది.

భార్య సుబ్బులక్ష్మి పడకటింటిని ముస్తాబు చేసి భర్తకోసం ఎదురుచూస్తోంది. రాత్రి మొదటి ఝామైంది. శాస్త్రి లోపలికిరాడు. సరమ్మ వొణుకుతూ లోపలపడుకో బాబూ అంది. సమాధానం రాకుండానే రెండవఝాముకూడా గడిచిపోయింది. మూడోఝాము ముందంజ వేసింది. శాస్త్రి మెల్లగా పడకగది ప్రవేశించాడు. సుబ్బులక్ష్మి నిద్రపోతోంది. దీపం వెలుతురులో దివ్యసుందరవిగ్రహం కనిపించింది. చంపకు చారెడేసి కళ్లు. పున్నమచంద్రుని పోలు ముఖం. ఛాందసపు యింటి పిల్ల, ఛాందసంగా శృంగారించుకుంది. సహజసౌందర్యానికి లోటులేదు. పద్మనాభశాస్త్రి పరకాయించి చూశాడు—భార్యా రూపవతీ శత్రుః—అనుకున్నాడు. సమయస్ఫూర్తికి సాటిలేని శాస్త్రి గరికమ్మని భార్య ముక్కుకి ప్రయోగించాడు. అమాయిక కెవ్వుమని అరుస్తూ లేచింది. కంగారుగా కాగడా పుచ్చుకుని ఒంటి కంటి సరమ్మ ఒక్క వుదుటున వచ్చిపడింది—ఏకాక్షీ లోక సంహారీ—అని పద్మనాభుడా వున్న వొక్క కన్నూ వూడబెరికాడు. తల్లీకూతుళ్ల తందనాలలో కాగడా తగిలి, తాటాకులకొంప నిప్పంటుకుంది—ఉష్ణం ఉష్ణేణ శీతలం—అని అల్లుడు అటుపక్కకూడా అంటించివూరుకున్నాడు. ఆలుగోలా, పాలుగోలా. ఊరివారందరూ వొచ్చిపడ్డారు. శాస్త్రి ఏమయాడో? అల్లుడి పాండిత్యం ఏం చెప్పుకొంటుంది అత్తగారు? ఎక్కువ శాస్త్రాలు చదివితే మిక్కిలి మిరియాలవుతారంటారు. ఇదే కాలుబోను!

కథ బాగుందా?






స్త్రీకి పురుషులతోపాటు సభా ప్రవేశానికి అవకాశ మెంతమాత్రము లేదను 1 వ శతాబ్దంనాటి అభిప్రాయానికి బలియయిన నారీమణి త్యాగగాథ.

రచన — రజని

వరాహాచార్యుడు సామ్రాట్ విక్రమాదిత్యుని ఆస్థానంలో జ్యోతిశ్శాస్త్ర పండితుడు. మిహిరాచార్యుడు అతనికుమారుడు. ఖనా మిహిరుని భార్య.

వరాహ : మిహిరా! మిహిరా!...ఖనా, మిహిరుడు రాలేదు?

ఖనా : రాలేదింకా. సంధ్యాజ్యోతి యిదిగో! మీరీ సాయంత్రం నక్షత్ర మంటపానికి వెళ్లలేదా? తొందర గా యింటికి వచ్చేశారు?

వరాహ : సంధ్యాజ్యోతిః పరబ్రహ్మ! వెళ్లలేదమ్మా ఖనా... అవును తొందరే...మిహిరుడింకా రాలేదేమో?

ఖనా : ఇంత తొందరగా ఎలా రావడం? నక్షత్ర మంట పములో ఈ నడుమ నూత్న పరిశోధన ప్రారంభించా రేమో?

వరాహ : అవునవును- మేయరాశిలో ఎన్ని తారకలో, ఏఆ కారముగలవో వాటి చరిత్రంతా పరిశీలిస్తున్నాడు... ఖనా...ఖనా...

ఖనా : మామగారు? ఏమికావాలి?

వరాహ : మిహిరుడు కావాలి.

ఖనా : మామగారెందుకో ఆరాట పడుతున్నారు? ఏదో చింతాగ్రస్తులై వున్నట్లున్నారు- కారణం నేను తెలిసి కొనవచ్చునా?

వరాహ : ఆరాటము- చింత. జీవితమే చింతామయం. శంకాభయసంకులం. పంచభూతాలలో కలసిపోయే వరకు...ఖనా...నా పరిశోధనాసర్వస్వం...సూత్ర రత్నావళి...నాగ్రంథాలు కనబడలేదమ్మా...

ఖనా : అయ్యో! వాటికోసం మీరు వెదికారా? నాకూ కనబడలేదు. ఆస్థానంలో ఏమైనా నూతన చర్చలా? సప్తర్షుల నడుమ వచ్చిన ధూమకేతువును గురించినచర్చ పూర్తి అయిందా?

వరాహ : అయ్యో! సప్తర్షుల నడుమ కాదమ్మా, మన నడు మకే ధూమకేతువు వచ్చిపడింది.

ఖనా : మామగారి ఉద్దేశ్యము బోధపడలేదు.

వరాహ : నాగ్రంథములు దొరకకపోతే ఈరాత్రి తెల్లవార కూడదు. తెల్లవారితే నాకు మీఅందరితోను ఋణము తీరిపోతుంది.

ఖనా : పాపము శమించుగాక. మీ మనస్సు ఎందుకో చెద రినట్లుంది. కొంచెము విశ్రాంతి తీసికోరూ! నేనుకాని అబ్బాయికాని, ఏమీ అపరాధము చేయలేదుగద!

వరా : అపరాధములు మీకెందుకమ్మా! నాపాపము పండి చక్రవర్తి శాసనముగా పరిణమించినది. ఏమి శాసనమో! రాజుల ఆగ్రహానుగ్రహాలు ప్రళయప్రభంజనాలు!

ఖనా : ఊరడిల్లరూ! ముందు కొంచెమూరడిల్లండి. విక్రమా దిత్య చక్రవర్తి శాసనమేమని...

వరా : బిడ్డా ఖనా !! ఆశ్చర్యమేమని చెప్పను. యవన దేశపు జ్యోతిష్కుడేదో అన్నాడని మహారాజు ఎంతటి తిక్క ప్రశ్న వేశారనుకొన్నావు? ఆకాశమునగల తారా గణమును లెక్కించి ఆసంఖ్య నుద్ఘాటించాలెనట- లేదా తెల్లవారుసరికి నా శిరస్సు నాదికాదు. బిడ్డా ! ఖనా ! మిహిరుడీలోపున వస్తాడా ? నాప్రాణము లేమైన...

ఖనా : మామగారు ! మామగారు ! ఈ ప్రశ్నకు తగినఉత్త రము నేనిస్తాను. మీరువెళ్లి మహారాజుకు చెప్పండి.

వరాహ : ఆఁ. ఆఁ. ఖనా ! నీకు సరియైన ఉత్తరము తెలుసా ? ఎందుకు తల్లీ నన్ను పసివాణ్ణిచేసి ఆడిస్తావు-

ఖనా : మామగారు, నేను అల్పజ్ఞురాలినైనా - నన్ను మన్నించి-ఇది వినండి. గుప్పిటినిండ ఇసుక పట్టుకొని అదివొక పళ్లెములోపోసి చక్రవర్తియెదుట పెట్టండి ! ఆపళ్లెములో ఇసుక రేణువులెన్నో ఆకాశములో నక్ష త్రములన్ని అని చెప్పండి.

వరాహ : ఖనా! ఖనా! నీవు మాగృహ దైవతానివి. మా కల్ప వృక్షానివమ్మా.

ఖనా : సంఖ్య కావలిస్తే చెప్పండి- తొమ్మిది కోట్ల తొం బది తొమ్మిది లక్షల ఇత్యాదిగా మీ యిష్టం వచ్చిన సంఖ్య చెప్పి- లెక్కించి చూడమనండి.

వరాహ : ఖనా! ఖనా! అఖండ మేధాశాలినివి నీవు ! మా భాగ్యదేవతవు. ఈ క్షణమే చక్రవర్తి దర్శనము చేసి వస్తాను.

౨

మిహిరుడు : (మెల్లిగా) ఖనా ! ఖనా ! నాయనగారింట్లో లేరుగదా !

ఖనా : ఇప్పుడిప్పుడే ఆస్థానానికి వెళ్ళారు. ఏమి?

మిహి : ఏమీలేదు. కొన్ని దినముల క్రిందట- ఒక యవన స్నేహితుడు చూచి యిస్తానంటే, నాయనగారి జ్యోతి శ్శాస్త్ర గ్రంథాలు...

ఖనా : ఏమిటీ ? మీరు తీసియిచ్చారా? ఇనడుగుదామనే అనుకుంటున్నాను. మామగారు [illegible]డా ఎంతో...

మిహి : నాన్నగారికి కనబడకపోతే కష్టపడతారని తెలుసు. ఇంతలో వాటికోసం వెతుక్కుంటారనుకోలేదు.

ఖనా : ఇంతకీ, ఆగ్రంథాలనుతీసి యవనుల కెందుకిచ్చారో మీరు ?

మిహి : అదేమిటీ ? మనదేశపు ప్రజ్ఞా ప్రభావములు ఇంతటి వని తెలిస్తే వారు మనయెడల విధేయులై సంచరిస్తారని.

ఖనా : అయ్యో...అదే మరొకలా పరిణమించింది.

మిహి : ఎలాగ ?

ఖనా : మీ యవనస్నేహితుడు మహారాజుతో ఏవో ప్రగ ల్భములు పలికినాడు. మహారాజు ఆకాశ గర్భమునందలి తారకాగణము సంఖ్య తెల్లవారు లోపున నిర్వచింప వలెను. లేదా, మరణదండనమని శాసించారట.

మిహి : యవనుడెంత ద్రోహి- అందుకేనా, నన్ను ఎంతకీ వదలక గ్రంథము లెంతసేపటికీ ఇయ్యక వేధించాడు. నాయనగారికి సమస్యకు తగినసమాధానము లభించిందా? ఎలా వెళ్ళారు, మహారాజుమందిరానికి.

ఖనా : సమాధానముతోనే మహారాజుల విలాసమందిరానికి వెళ్ళారు.

మిహి : అయితే, నేను వెంటనే మహారాజు విలాసమంది రానికే వెడతాను.

3

మహాకాళేశ్వరుడి ఆలయంవద్ద

మిహి : యవన జనుల దుర్బోధలు విని సామ్రాట్టు స్వీయ జనాన్ని కష్టపెడుతున్నారన్నమాట - నాయనగారు ! ఇది భరించడమెలాగ ?

వరా : నాయనా! వారు పాలకులు, మనం పాలితులం.

మిహి : నాయనగారూ ! పాలకుడే సదాచారమును పాలిం చకపోతే ప్రజకింక వేరే పట్టుగొమ్మ దుర్లభంకదా! శక

యవన బర్బర సామంతాదులు పరివేష్టించిన సభకు మీ కోడలిని తీసుకొని రమ్మనే మీ అనుజ్ఞా ?

వరా : నా అనుజ్ఞ ఏమిటి నాయనా? రాజాజ్ఞ అది. తప్పితే వంశచ్ఛేదము.

మిహి : వార్థకమున అందరికీ యుక్తాయుక్త పరిజ్ఞత సడలునేమో.

వరా : నాయనా-దురుసుతనం మాను-

మిహి : మీరే- ఆయుక్తి మీకోడలికి తోచినదని యెందుకు సభలో అంగీకరించారు?

వరా : అసత్యభాషణ మనయింటనూ వంటనూ వుందా నాయనా ఎప్పుడైనా.

మిహి : అయితే, రండి యింటికి, మీరే కోడలిని అలంకరించి రాజసభకు స్వయముగా......

వరాహ : మిహిరా ! నన్ను మాటలతో చంపుటకంటె, ఆమెను సభకు తీసుకపోక రాజుచేత చంపించుటకంటె నీ చేతితోనే చంపివెయ్యరాదూ ?

మిహి : రాజ ధిక్కారము, పితృవాక్య ధిక్కారము, పితృఘాత-ఇన్ని పాపములా-నాయనగారు ! మీపాదాల కన్నుల కద్దుకోనీండి. నన్ను మన్నించండి. మీకోడలితో మాటాడి మీ ఆజ్ఞకు, రాజాజ్ఞకు, భంగము లేకుండా కార్యము చక్కబెడతాను.

వరాహ : సర్వనాశనానికి సిద్ధపడిన వాణ్ణి నేను- కాశీశ్వరుని సన్నిధి వదలను.

౪

వరాహాచార్యుని ఇంటిలో ఖనా, ఖనాభర్త మిహిరుడు-

మిహిరుడు : ఖనా ! ఖనా !

ఖనా : ఇదిగో ! మీకోసమే చూస్తున్నాను. మొన్న సప్తర్షి మండలంలోకి వచ్చిన ధూమకేతువు తిరిగి ౭౭ సంవత్సరాలికి రావచ్చునని గుణించాను. ఇదిగో గణితము.

మిహి : ఇప్పుడుకాదీ గణితము.

ఖనా : అన్నట్టు ఆస్థానానికి వెళ్ళారా ?

మిహి : ఆస్థానం నించేనారాక.

ఖనా : మామగారు కనబడలేదూ ?

మిహి : కనబడినారు.

ఖనా : చక్రవర్తి అడిగిన ప్రశ్నకు ఉత్తరమిచ్చారా ?

మిహి : అన్నీ అయినాయి !

ఖనా : చక్రవర్తి ఏమన్నారు ?

మిహి : ఇంతటి మేధావంతమైన యుత్తరమిచ్చిన వ్యక్తి ఎవ్వరయినా సరే, ఆస్థానానికి తోడ్కొని రావాలని చక్రవర్తి ఆజ్ఞ.

ఖనా : ఏమిటి ? నేనా ! ఆస్థానానికా !

మిహి : అవును. ఏం వెడతావా, ఆస్థానానికి ? శకయవన సామంతాది పరివేష్టిత సభలో పురుష పండిత ప్రకాండుల నడుమ ధాటిగా నిల్చొని శాస్త్ర చర్చ చేస్తావా?

ఖనా : (భయపడుచూ) నాథా ! మీఆజ్ఞ ఏమని ?

మిహి : చక్రవర్తి ఆజ్ఞ ఆస్థానానికి రమ్మని-వెడతావా, ఖనా ?

ఖనా : నాథా ! మన్నించాలి. నాకు ఆస్థానము, సభ, పరిషత్తు, సర్వస్వము మీరే ! నేనాఆస్థానానికెందుకు వెడతాను?

మిహి : ఖనా ! చక్రవర్తి ఆజ్ఞ-ఆస్థానానికి నీవు పోనైన పోవలెను. లేదా మేము చావ వలెను.

ఖనా : నాథా ! ఏవాక్శక్తిని వినగోరి చక్రవర్తి ఇటువంటి చండ శాసనము చేశాడో-ఆవాక్శక్తి నాజిహ్వా-ఇదిగో దీనిని చక్రవర్తికి చూపండి.

మిహి : ఆఁ. ఆఁ. ఖనా ! ఖనా ! జిహ్వను ఖండించుకొంటివా ? ఇంతటి త్యాగమా ! ఖనా ! ఖనా ! ధన్యజీవివి.

—ఆలిండియా రేడియోవారి అనుమతిని.





* ఉష　　　* సత్యం　　　* అరవింద

" చిన్నికృష్ణమ్మ, నిన్నునే చేరికొలుతు "

# అభాగిని లేఖలు

అక్కయ్యా,

నా గత జీవితాన్ని జ్ఞప్తికి తెస్తూ, నాలోని మార్పును గుర్తిస్తూ నీవు వ్రాసిన వుత్తరం అందినది. నా పరిస్థితిని తెలిపే యీ ప్రత్యుత్తరం నీ సందేహ నివృత్తికి తోడ్పడగలదు. నా పెళ్లి అయినప్పటినుంచి నా ప్రవర్తన కనిపిస్తోందన్నావు. అవును! నీవన్నది నిజమే. గడచిన దినాల్లో నాలో వెల్లువగా పారిన చైతన్య ప్రవాహము గడిపేదినాల్లో యిగిరిపోతోంది. ఈ వ్యత్యాసాన్ని గాంచిన నీవే గాదు, నన్నెరిగిన వాళ్లంతా ఆశ్చర్యపోతున్నారంటే అతిశయోక్తి కానేరదు. కాని నిజం నీవెరిగినట్లయితే యీ మార్పుకి కారణం—నా ప్రయత్నాలను కొనసాగనీయని ప్రతిబంధకాలున్నాయని తెలుసుకుంటావు.

మనం చదువుకునే రోజుల్లో ఆయన నేను కలిసి కాలేజికి వెళ్లేవాళ్లం, వాగ్వివాద పోటీల్లో పాల్గొనేవాళ్లం. స్ఫురణకువచ్చే వుంటుందనుకుంటాను. ఓ రోజున నేను ప్రవేశపెట్టిన స్త్రీ స్వాతంత్ర్యమనే శీర్షికను సమర్థిస్తూ ఆయన యిచ్చిన గంభీరోపన్యాసము జ్ఞాపకం వుందనుకుంటాను నీకు. సభ వారి ప్రశంసలకు పాత్రులయ్యారు. ప్రతికక్షులు సయితం ఆయన వుపన్యాసం విని వుర్రూతలూగారు. అక్కడున్న యావత్ స్త్రీలోకం తమ జాతి ఉద్ధారకుడని ఎదురుచూసింది. ఆరోజున నా వాదం వీగిపోతుందేమోనని ఎంతో ఆందోళన పడ్డాను. ఆయన మాట్లాడక పోతే అంత పనీ జరిగేదే! ఇద్దరి ఆశయాలు ఒక్కటైనందుకు ఎంతో ఆనందించాం. ఒకరి నొకరు ప్రేమించుకొని నిజ ప్రపంచాన్ని మరిచిపోయేవాళ్లం. మేమిద్దరం అన్యోన్యంగా మెలగడం జూచి యిరుగు పొరుగువాళ్లు పొందే యీర్ష్యనుపాటించకుండా, ఓర్వలేని తోటి విద్యార్థులు గోడలమీద గీసిన బొమ్మలు, రాసిన రాతలు లెక్కచెయ్యకుండా చరించిన రోజులు నీ దృష్టి పథంలో వుండే యుంటాయనుకుంటాను. నీకు నేను, నాకు నువ్వే యీ లోకంలో అని ఆయన అన్న మాటలు ఆలకించి ఆత్మానందం పొందేను. తక్కువ జాతి వాడని తల్లితండ్రులు వలదంటున్నా ఆయన్ని వివాహమాడాను, తల్లితండ్రులను త్యజించాను. ఆయన కోసం అయినవాళ్లను, కావలసిన వాళ్లను వదులుకున్నాను. "ఊరికే వుపన్యాసాలివ్వగానే సరిగాదు, రేపొద్దున ఏం చేస్తావో చూడకపోం" అని ప్రక్కనున్న స్నేహితులు పరిహసించినప్పుడు, "నా సతికి సంపూర్ణమైన స్వాతంత్ర్యం యిస్తాను. స్వార్థంతో నిండిన సంఘాన్ని ధైర్యంతో ఎదుర్కొంటానంటే సంతోషంతో సమ్మతిస్తాను. దేశం కోసం, పీడితప్రజానీకంకోసం పాటుపడతానంటే ఆమోదిస్తాను. మేమిద్దరం ముందుకు నడుస్తాం. మమ్మల్నిజూచి కాకులవలె కూసే లోకులకు వెరవను. కష్ట నిష్ఠూరాలకు జంకను." అని ఆయనిచ్చిన సమాధానం యింకా నా శ్రవణద్వయంలో శ్రుతి వేస్తూనే వుంది. కాని, అక్కయ్యా, నమ్ముతావో నమ్మవోగాని యిప్పుడు ఆయన ప్రవర్తన చూస్తే గతమంతా ఓ స్వప్న వృత్తాంతంలా గోచరిస్తోంది. ఆయన కోరిన ఆశయాలు నేను కలిగియుండడంవల్లనే ఆయన ప్రేమకు పాత్రురాలయ్యాను అప్పుడు. తదాశయ సిద్ధికోసం నేను పాటుపడడమే ఆయన లోపంగా ఎంచుతున్నారు యిప్పుడు. ఆ రోజున వుపన్యాసం విని ఆయన్ని పరిహసించిన స్నేహితులకు వారిచ్చిన సమాధానం యీ రోజున యితిహాసరూపంపొందింది. భూతకాలంలో సంఘ విప్లవంకోసం పాటుపడే చైతన్య శక్తిగల ఆయనకు అండగా తత్కార్య కృషికోసం కంకణం కట్టుకున్న నాపై జూపిన సహనం, సంఘీభావం, సౌజన్యం వర్తమానకాలంలో వర్తించడం లేదు. చదువుకునే రోజుల్లో తలపెట్టిన సమస్యల్ని సంసారం సాగించే యీ దినాల్లో సాధింప సమకట్టిన నన్ను ఆయన విమర్శిస్తున్నారు. స్వార్థంతో నిండిన సంఘం నా శీలాన్ని శంకిస్తుందని సంఘసేవ చేస్తానంటే సందేహిస్తున్నారు. ఇది నా స్థితి. మరేమన్నా విశేషాలుంటే ముందు వుత్తరాల్లో వివరిస్తాను.

ఇచ్చట మేమంతా క్షేమం. క్షేమం తరచు తెలియపర్చగోర్తాను.

ఇంక సెలవు

...............



# కత్తికి జడవకండి!

**ఈ మధ్య తూర్పు బెంగాలులో ప్రజ్వరిల్లిన అమానుష ప్రవర్తనకు చిక్కుకొని అదృష్ట వశమున సంరక్షింపబడిన ఒక హిందూ నారీమణి యొక్క లేఖ యిది. బానిస యుగంలో పెరిగిన పురుషులకు ధైర్యసాహసాలు నశించినప్పుడు స్త్రీలకు యిట్టి శంఖారావములు అవసరం. —సం॥**

నేను యీ లేఖను వ్రాయడానికిముందు వీరు లైనటువంటి లేక వీరుల మనుకునే టటువంటి సోదరుల క్షమార్పణ వేడుకుంటున్నాను. ఇత రుల్ని గురించి యీ క్రింది విధంగా వ్రాయవలసి వచ్చినందులకు చాల విచారిస్తున్నాను. ఇది నా మనవి మాత్రమే; ఈ నావిన్నపాన్ని మీరంతా జాగ్రత్తగా పరిశీలించి, తిరిగి నేను యిటువంటి విజ్ఞప్తులు చేయవలసిన అవసరం రాకుండా చేస్తా రని విశ్వసిస్తున్నాను.

ప్రస్తుతం మనసోదరీ మణులకు జరుగుతున్న అన్యాయాలు ప్రత్యక్షంగా చూస్తూనే వున్నాం. ఈ అన్యాయాలు ఆపడానికి అంతాకూడా ప్రయత్నం చేయాలి. పూర్వం ఝాన్సీ లక్ష్మీ బాయి, దుర్గావతి, కర్ణావతి మొదలైన వీర నారీమణులు రణరంగంలోనికేగి వీరులమని విర్ర వీగే పురుష పుంగవుల నందరినీ దాసోహమని పించారు. కాని ఇప్పటి మన సోదరీమణులలో అంతటి ధైర్యస్థైర్యాలు లేకపోయినా, వీర నారీ మణుల అడుగు జాడల ననుసరింపవలెనని అభి లాషవుంటే ఎంతేనా సేవ చేయవచ్చు. స్త్రీలు అబలలు కారు. శక్తిస్వరూపిణిలు. మాతృ దేవ తలు. బిడ్డలు వీరులవడానికి గాని భీరులవడానికి గానికారణం స్త్రీలే. మన సోదరులు ఖడ్గపు విద ళింపు వినేటప్పటికే పారిపోయేటంత పిరికివాళ్ళుగా తయారయ్యారు! ఇక దానధర్మాలమాట తల పెట్టేటప్పటికి హృదయం భారమై పోయేటంత దానకర్ణులు! అందుచేత మీరంతా హిందూ సంఘానికి నిజమయిన సేవచేయ దలచుకుంటే యీ క్రింది విధంగా చేయవచ్చునని మనవి చేస్తు న్నాను:—

1. మీభర్తలనూ, సోదరులనూ, బిడ్డలనూ యీవిధంగా ప్రబోధించండి. ప్రతి మానవుడు కూడా తన శక్త్యానుసారం, ధనమూలంగా గాని. శారీరకంగా గాని తోటిమానవులకు సహాయం చేయాలి. అలా చేయనినాడు వినాశమే మూడు తుంది. ఇదే ఇప్పుడు మన కళ్ళముందు జరుగు తూవుంది. "దానము భోగము నాశము। పూని కతో మూడుగతులు భువిధనమునకున్, దానము భోగము నెరుగని। దీనుని ధనమునకు తృతీయమె పొసగన్!"

2. ఆపత్కాలంలో మీపురుషులకు ధైర్య సాహసాలు పురికొల్పి ఉత్తేజితుల్ని చేయండి. ఏస్త్రీయైతే వీరుల్ని కంటుందో ఆమె ధన్యురాలు. ఏస్త్రీ వీరుడైన పతిని పొంద గలుగుతుందో ఆమె సార్థకజీవి. ఏపురుషుడయితే తన సోదరీ మణుల మాన ప్రాణాలను రక్షించ గల సమర్థుడో అతడే నిజమయిన సోదరుడు. అటు వంటి సదవకాశాలు లభించినప్పుడు సోదరికాని, భార్యకాని, తల్లిగాని పురుషుల్ని ఘనకార్య నిర్వాహకులుగా ప్రేరణ గావించి 'మీకుజయ మగుగాక' అని ఆశీర్వదించి పంపండి.

3. ప్రఫుల్లతజెందే పుష్పములుగా నున్న పసిపాపలకు సర్వదా వీరుల యొక్క, వీరనారీ మణుల యొక్క చరిత్రలు నూరిపోయండి. శత్రు సంహారం చేయవలసిందేకాని ఆ శత్రువుయింటి స్త్రీలను పసిబిడ్డలను మాత్రం హింసించరాదు. వారి గౌరవానికి, శీలానికి ఎంతమాత్రం హానికలిగించరాదు అని ఉపదేశిస్తు ఉండండి.

4. మీరుకూడా విస్తారధైర్య సాహసాలతో మెలగండి. కత్తిమాట తలపెట్టే టప్పటికే గడగడ వణకి ఏడ్వు ప్రారంభించకండి. అవసరం వచ్చినప్పుడు కత్తిదూసి మీశీలాన్ని, మీ పాతివ్రత్యాన్ని కాపాడుకుని దుష్టసంహారం చేయగలిగి ఉండాలి. ఇంత జేసినా ఆ మ్లేచ్ఛుల చేతులలో చిక్కడం తప్పనిసరి అయినట్లయితే ఏదో విధంగా ఆత్మహత్య చేసుకుని మీ సతీత్వాన్ని కాపాడుకోవాలి. ఇంతమాత్రంకూడా మీలో సాహసం లేనప్పుడు మీపురుషులైనా మీప్రాణాలు తీసి మిమ్మా దుష్టుల బారినుండి రక్షించేటట్లు ప్రార్థించాలి.

4. ఎంతకాలం మనసోదరులు మనల్ని సంరక్షించగల శక్తి సంపాదించలేరో అంత వరకు మనం బాహాటంగా రోడ్లమీద తిరగరాదు.

5. మీకు ఎవరైనా సహాయం చేయదలచుకుంటే అది ధనరూపంలో తీసుకొని దాన్ని సంఘసేవకు వినియోగించండి. అవసరం వచ్చినప్పుడు మీనగలు, నాణ్యాలేగాకుండా సర్వస్వముధారపోసి సంఘానికి సేవచేయడానికి తయారుగా ఉండాలి. ఇప్పుడంత త్యాగము చేయవలసిన అవసరంలేదు. మనసోదరులు తలుచుకుంటే వారే వలసిన సహాయం చేయగలరు. ఏదిచేయదలచుకున్నా పెద్దల సహకారం, సానుభూతులతోచేయండి. అంతేగాని మోసగాండ్ర దంబాలలో చిక్కుకోకండి.

ఈ పైన చెప్పిన విషయాలన్నిటినీ చక్కగా అవగాహన చేసుకొని, వాటిని ఆచరణలో పెట్టినట్లయితే, మీరంతా దేశానికి నిజమయిన సేవ చేశారని ఆనందిస్తా.

—సోదరి

—'హిందీ సరస్వతి' నుండి

అనువాదం: కె. సుగుణమణి



# ముప్పిడివారి చంద్రమతి

రంగస్థలంలో పురుషులు స్త్రీ పాత్రలు ధరించి ప్రేక్షకులకు రసానుభూతి గలిగించడం బహుదుర్ఘటమైన కార్యం. అభినయం ఒక దివ్యమయిన గుణం, అది ప్రతివానికి అలవడేది కాదు. నాటకంలో వేషంవేసే ప్రతివేషగాడూ నటుడు కాజాలడు.

తాను ధరించే భూమికను చక్కగా అర్థంచేసుకొని, ఆ భూమికలో లీనమై ప్రేక్షకులకు తాము చూస్తున్నది నాటకముగాక యథార్థ సంఘటనమే అనే భావం కలిగింపజాలిన వాడే నటుడు.

మహారాష్ట్ర నాటకరంగంలో బాలగంధర్వ, ఆంధ్ర నాటక రంగంలో కీర్తిశేషులైన ముప్పిడి జగ్గరాజు గారు సాటిలేని యశస్సు నార్జించు కొన్నారు.

ముఖ్యంగా ముప్పిడి జగ్గరాజు గారు, ఆంధ్ర నాటక రంగంలో ఏనాడయితే అడుగు పెట్టారో, ఆనాడే ఆంధ్ర దేశంలో నవయుగోదయ మయిందంటారు. నాటక రంగం అంటే ప్రజలలో శ్రద్ధ, ఆసక్తి, ఉత్సాహం ప్రదీపించినవి.

ఉత్తమ నటులను గురించి ఎక్కడ ప్రసక్తి వచ్చినా జగ్గరాజు గారి మాట తలపెట్టని వారుండరు. ముఖ్యంగా కరుణ రస ప్రదర్శనకు ఆయన పెట్టినది పేరు. ఇప్పటికీ ఎవరయినా దమయంతి, చంద్రమతి, మొదలయిన ఉదాత్త నాయిక పాత్రలను ధరించినపుడు చూచేవారు "ఈ వేషాలు జగ్గరాజు గారు వేసినపుడు చూసి పొందిన రసానుభవం తిరిగి కలగడం కల్ల" అని అంటూ ఉంటారు.

1898 ప్రాంతంలో జగ్గరాజు గారు యింకా విద్యార్థిగా ఉన్నప్పుడు పూనానుంచి ఒక నాటక కంపెనీ వచ్చిందిట. దానిపేరు జఖండీ సమాజం; ఆసమాజం ఆంధ్ర దేశంలో అనేక నాటకాలు ప్రదర్శించింది. నిద్రాణమైన పరిస్థితిలో వున్న ఆంధ్ర నటులకు కనువిప్పు జేసింది. ఆసమాజంలో బాబూరావు అనే నటుడు శోకరసాత్మక మయిన భూమికను అనన్య సామాన్యంగా ధరించే వాడట. అదిచూచిన జగ్గరాజుగారిలో అంతర్వాహినిగా అణగివున్న ప్రతిభ పొంగి పొరలింది. బాబూరావును లక్ష్యంగాగొని జగ్గరాజు గారు నాటక రంగంలో ప్రవేశించినాడు. అచిర కాలంలోనే ఆయన పేరు అత్యున్నత కీర్తిశిఖరాలను అందుకొంది.

చంద్రమతి పాత్రను జగ్గరాజు గారు ధరించగా చూచిన వారు ఒక్కసారిగాదు పదిసారులైనా కంట తడిపెట్టే వారట. అంత అమోఘంగా, అంత అద్భుతంగా, అంత మహోత్కృష్టంగా అభినయించ గలిగిన కళాజీవి ఆయన.

తన కళా కుశలత్వంచే ప్రేక్షకులను ముగ్ధులుగా సమ్మోహితులుగా చేయగల్గిన జగ్గరాజు గారు చంద్రమతి భూమికను నిర్వహించగా చూచిన వారు వేరు వేరు ఘట్టాలలో ఆయన ప్రదర్శించిన హావభావాభినయ విశేషాలు యిప్పటికీ కళ్ళకు కట్టినట్లుగా ఉంటాయంటారు.

రాజ్యాన్ని విశ్వామిత్రునకు ధారవోసి అడవిలో కంటకాన్వితమయిన మార్గాలను నడువలేక ఆయాస ఖిన్నురాలైన చంద్రమతిని చూచి

"ఏనాడు నడచినామీఎడారులలోన
సలలితారామ సీమలనె గాని"

అని హరిశ్చంద్రుడు వాపోయినపుడు "ధరపై పుట్టిందిన ఏ ప్రాణికైనను కొన్ని నాళ్ళు సుఖంబును, కొన్ని నాళ్లు దుఃఖంబును తప్పవుగదా" అంటూ చూపిన ఉదాత్తత, కష్టాల పాల్చేసిన పతిని పరిత్యజించి, రాజ్యానికి తిరిగి వచ్చి సుఖంగా ఉండమని నక్షత్రకుడు బోధించినపుడు వ్యాఘ్రాజిన ధారియై భిక్షాటనచే కుక్షి నింపుకొని శ్మశాన వాటికల తిరిగే శంకరుని పార్వతి సేవించే సాదృశ్యం తెచ్చి, కష్టకాలంలో పతిని ఏసాధ్వి విడువ నొల్లదని చెప్పిన సందర్భాన కనపరచిన పతిసేవా పరాయణత మనం మరవలేము.

## ముప్పిడివారి చంద్రమతి

అలాగే ఋణ పరిష్కారానికి నక్షత్రకుడు వేధించగా విసిగి వేసారిన పతిని చూచి "ఏ కలవానికేని నన్ను బాని సగా విక్రయించి మాని ఋణము తీర్చుకొం" డని త్యాగ బుద్ధిని ప్రదర్శించిన ఘట్టంలో జగ్గరాజు గారు చూపిన అభి నయ విస్ఫూర్తి అనూనం అంటారు. సర్పదష్టుడై పడివున్న కుమారుడు లోహితుని కోసం గుండెలు పగిలిపోవునట్లు యేడ్చినపుడు చూపిన కడుపు తీపు హృదయ విదారకం. శవదహానానికి తనకడ ఒక్క గవ్వ అయినా లేదన్నప్పుడు వీరబాహుని పేరుతో మరుభూమిని కావలికాస్తూన్న భర్త, మాంగళ్యాన్ని విక్రయించి సొమ్ము తెమ్మన్నప్పుడు వెలిబుచ్చిన రిచ్చపాటు-ప్రేక్షకుల మనస్సులను విషాద రస తరంగితము చేసి, కనులనుంచి దుఃఖాశ్రువులను కాలువ కట్టిస్తాయి.

రసాను గుణంగా పద్యాలు చదవడంలో - భావాను గుణంగా అభినయించడంలో-సందర్భానుసారంగా పాటలు పాడడంలో జగ్గరాజు గారితో పోల్చడం సాధ్యం కాదట.

విద్వత్సభలు, ప్రముఖులు ఆయనకు జోహారు లర్పించి 'ఆంధ్రనాటక కళాపూర్ణ', "నటకావతంస" బిరుదాలతో సత్కరించారు.

స్త్రీ పాత్రను ధరించి కరుణా రసాన్ని యింత అద్వితీయంగా ప్రదర్శించ గలగడం జగ్గరాజు గారి విశిష్టత. చంద్రమతి పాత్రవల్ల ఆయనకు నాట్య కళలో అమరత్వం సిద్ధించింది.

—రేడియో మహిళామండలి కార్యక్రమంలో.

---

# సాయంసమయం



శ్రీమతి గట్టి సత్యవతి

బెడకొండలు
వెడకుండలు
పరుండిన
నందులు
మన్నుమశానం
పశ్యతోహర
శ్మశానం.

లంకాదహానం
గహనగహానం
వేడినెత్తురు
ఎఱ్ఱని కండలు
కడుపులుకాలే
ఆకలిమంట
మహాప్రళయాగ్ని.

* *

నల్లద్రాక్ష
పళ్ళగుత్తులు
పరిణతకేళీ
పరిచితమేస్గు
గాలివాలున
నట్టేట
తెరచాప.

ఇంద్రచాపం
మహాటోపం
ప్రళయకృతాంతుని
కుమిలిన కోపం
చితిలోమంట
సన్యాసుల
కావిగుడ్డ.

* *

తాంబూలపు ఎఱ్ఱనిపెదవి
అల్లోనేరేడు అల్లినదుప్పటి
నల్లనిరవిక అంతాచీకటి అంధకారం.

* *



# స్త్రీ విద్య

* శ్రీమతి గోవాద ఆలీస్‌రత్నమ్మ *

"గృహమును సౌఖ్యమయంగా సౌందర్యయుతంగా చేయగల సీమంతిని ప్రతిభ, ఇంతకన్న పెద్ద విషయాలలోకూడా వ్యక్తంకావాలి, ఈ విశాల ప్రపంచాన్ని యిప్పు డున్నదానికంటె యెన్నో రెట్లు సౌఖ్యమయంగా, సౌందర్యయుతంగా, ధర్మబద్ధంగా మానవులు నివసించడానికి అర్హమైన ప్రదేశంగా చేయడంలో స్త్రీల ప్రతిభ వినియోగ పడాలి."

—విజయలక్ష్మీ పండిట్.

"ఉద్యోగాలు చెయ్యాలా ? ఊళ్లు ఏలాలా ? ఆడదానికి చదువు ఎందుకు ?" అని వాగ్వివాదాలు చేసే రోజులు పోయినవి. స్త్రీ చదువుకోవాలా? అక్కరలేదా? అనేది కాదు నేటి సమస్య. స్త్రీకి ఎలాటి చదువు కావాలి ? స్త్రీకి పురుషుడికి ఒకేరకం చదువు వుండాలా ? స్త్రీవిద్య అభివృద్ధి చేయడానికి ఎట్టి మార్గాలు అవలంబించాలి? ఈ విషయంలో ప్రభుత్వ ప్రజా సంస్థల బాధ్యతఏమిటి ? చదువుకొన్న స్త్రీలు నిర్వహించవలసిన కర్తవ్యము లేవి? ఈకర్తవ్యాలను సక్రమంగా నెరవేర్చ గల్గుటకు సంఘంలో ఎట్టి మార్పులు రావాలి ? అను సమస్యల గూర్చి స్త్రీలు, విద్యాభిలాషులు, దేశాభ్యుదయాన్ని కోరే అందరూ ఆలోచించ వలసివుంది.

స్త్రీకి ఎలాంటి చదువు కావాలి? అనే సమస్యకు జవాబు సంఘంలో స్త్రీకి యెట్టి స్థానం, బాధ్యత ఉంది - అనే విషయంపై మన దృక్పథాన్ని అనుసరించి ఉంటుంది. "స్త్రీ స్థానం వంటయిల్లు, పురిటిగది మధ్య,ఇంటి నాలుగు గోడల మధ్యనే" అనే వారు స్త్రీలకు ప్రత్యేక విద్యావిధానంవుండాలని, గృహనిర్వహణ, శిశుపోషణ, కుట్టుపని, సంగీతము, లలితకళలు, మొదలగు ప్రత్యేక విషయాలు స్త్రీలకు బోధిస్తే చాలునని అంటారు. స్త్రీలకు పురుషులకు సృష్టిలోనే భేదం వుందని, అందుచేత విద్యావిధానంలో భేదంవుండాలని, స్త్రీలు అబలలు కాబట్టి కఠినమయిన చదువుకు తాళలేరని, పెళ్ళికాగానే కాపురానికివెళ్ళి పిల్లా జెల్లా సంగతి చూచుకోవలసిన స్త్రీకి మొగాళ్ల చదువు ఎందుకని జాతీయ జీవనంతో సంబంధములేని విద్యావిధానానికి స్త్రీలనుకూడా యెందుకు బలి యివ్వాలని, అసలే నిరుద్యోగంతో చస్తూంటే ఆడవాళ్లకి ఈఉద్యోగాల చదువెందుకని ఈవిధంగా వీరు వాదిస్తారు. చెమటోడ్చి కష్టపడి సంపాదించడం మొగాడిపని, ఇల్లు చక్కదిద్ది అందాల రాశియై గృహలక్ష్మిలాగ మెలగడం ఆడదాని పనియని వీరివాదన. కొంచెం ఆలోచిస్తే ఈవాదనలో పసలేదని, స్త్రీవిద్యకు వ్యతిరేకంగా నిలబడిన అభ్యుదయ నిరోధకుల కొత్తపంథయే ఈవాదన అని స్పష్ట మవుతుంది. స్త్రీ తన అభిరుచిని అనుసరించి ఏశాస్త్రమునైనా అభ్యసించడానికి, తద్వారా ప్రజలకు సేవచేయడానికి ఎందుకు అవకాశముండకూడదు ? శాస్త్రవేత్తలుగా, పరిశోధకులుగా, ఆర్థిక రాజకీయ వేత్తలుగా, ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, కళావేత్తలుగా, స్త్రీలు కూడా శిక్షణ పొందితే దేశానికి లాభకరం గాదూ? ఇతర దేశాలలో స్త్రీలు, పురుషులు నిర్వహించగలిగిన వృత్తులన్నిటిని నిర్వహించగలరని ఋజువుచేయడంలేదూ? మన కార్మిక కర్షక స్త్రీలనెరిగిన వారు ఎవరు వారిని అబల లనగలరు. గృహనిర్వహణ, శిశుపోషణ మొదలగువిషయాల్లో స్త్రీలకు ప్రత్యేక శిక్షణ వుండవలసిందే. కాని అంతటితో ఆగాలి అనడంలో ఏమాత్రం అర్థం లేదు. ఆమాటకొస్తే గృహనిర్వహణలో, శిశుపోషణలో పురుషుడికి మాత్రం బాధ్యత లేదూ?

ఈ విషయాలు తెలియని పురుషుడు సౌఖ్యమయ గృహ జీవనానికి ఏవిధంగా తోడ్పడ గలడు? లలిత కళలను పురు

షుడు అభ్యసించ కూడదంటే ఏమయినా అర్థముందీ? విద్యా విధానములో లింగభేదములను ప్రవేశ పెట్టడం స్త్రీల అభివృద్ధికే కాక దేశక్షేమానికే భంగకరం. స్త్రీలు, పురుషులు వారి వ్యక్తిగతాభిరుచిని బట్టి విద్యనభ్యసించడానికి, తద్వారా దేశానికి సేవ చేయడానికి అవకాశముండాలి. నేటి విద్యావిధానం పనికిరానిదిగా ఉన్నదంటే దానిని సక్రమ మార్గాలలో సంస్కరించాలిసిందే. ఈసంస్కరణ పురుషులకు స్త్రీలకు కూడ అవసరమే. నిరుద్యోగానికి తావులేని ఆర్థిక విధానానికి పునాది వెయ్యడం అవసరం. ఇది పురుషులకు, స్త్రీలకు కూడా అవసరమే.

స్త్రీల స్థానం గృహంలోనే కాబట్టి వారికి అందుకు తగిన విద్యావిధానమే కావాలి అనే వారికి ఇదిగో శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఇచ్చిన చక్కని జవాబు.

" స్త్రీలు గృహ నిర్మాతలుగా, సౌఖ్యమయ సౌందర్య యుత గృహజీవనానికి కృషి చేయవలసినదే. గృహమును సౌఖ్యమయంగా సౌందర్యయుతంగా చేయగల సీమంతిని ప్రతిభ, ఇంతకన్న పెద్ద విషయాలలో కూడా వ్యక్తంకావాలి. ఈ విశాల ప్రపంచాన్ని ఇప్పుడున్న దానికంటె ఎన్నో రెట్లు సౌఖ్యమయంగా, సౌందర్య యుతంగా, ధర్మ బద్ధంగా, మానవులు నివసించడానికి అర్హమైన ప్రదేశంగా చేయడంలో స్త్రీల ప్రతిభ వినియోగపడాలి. "

మనరాష్ట్రంలో స్త్రీవిద్యలో అభివృద్ధి కనిపించడం శుభ సూచకం. నేడు ఎలిమెంటరీ స్కూళ్లలో సుమారు 11 లక్షల మంది, సెకండరీ స్కూళ్లలో సుమారు 65 వేల మంది, వివిధ కళాశాలల్లో సుమారు మూడువేల మంది, వృత్తి విద్య నేర్పు కళాశాలలలో 550 మంది విద్యార్థినులు వున్నారు. మనరాష్ట్రంలో మొత్తం స్త్రీలసంఖ్య సుమారు 250 లక్షలు అని మనం జ్ఞాపక ముంచుకొన్నప్పుడు, స్త్రీవిద్య ఇంకా ఎన్నిరెట్లు అభివృద్ధికావాలో స్పష్టమవుతుంది. చాలామంది బాలికల చదువు ఎలిమెంటరీ స్కూళ్లతోనే ఆఖరవుతుంది. ఉన్నత విద్య నభ్యసించుచున్న స్త్రీలు చాలా తక్కువ.

ప్రభుత్వం స్త్రీవిద్య నభివృద్ధిచేయడానికి ఇంకా ఎక్కువ శ్రద్ధచూపాలి. ప్రస్తుత పరిస్థితులలో స్త్రీలకు ప్రత్యేక పాఠశాలలు, కళాశాలలు ఎక్కువగా అవసరం. అన్ని శాఖలలోను విద్య నభ్యసించడానికి స్త్రీలకు వసతులు వుండాలి. పురుషులతో పాటు స్త్రీలకు అన్ని ఉద్యోగాలకు ప్రవేశ ముండాలి. ఈవిషయంలో మద్రాసు అసెంబ్లీలో ప్రధాని హామీ ఇవ్వడం హర్షించదగిన విషయం. గ్రామీణ స్త్రీలలో చదువురానితనాన్ని నిర్మూలించడానికి ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించాలి. ఫ్యాక్టరీలలో వివిధపరిశ్రమలలో పనిచేయు స్త్రీలకు ఉచిత విద్యకు అవకాశముఏర్పాటుచేయబడునట్లు ప్రభుత్వము చూడాలి. మాతాశిశురక్షణాలయములను, కిండర్‌గార్టెన్ స్కూళ్లను ప్రభుత్వము విరివిగా స్థాపించాలి. ప్రజల ఆర్థికస్థితిని బాగుచేసి, విశ్రాంతిని కల్పించినపుడే స్త్రీలు విద్యకుగల పూర్తిఅవకాశాలను వినియోగించుకో గలరు.

చదువున్న స్త్రీలు, విద్యార్థినులు కూలివాడలకు గ్రామాలకు పోయి నిరక్షరాస్యతానిర్మూలనానికి కృషి చేయాలి. చదువుకున్న ప్రతిస్త్రీ కనీసం సంవత్సరానికి ముగ్గురు స్త్రీలకు చదువను వ్రాయను నేర్ప ప్రతిజ్ఞపూనాలి. గ్రామ, పట్టణ మహిళా సంఘాలు విశ్రాంతి కాలంలో స్త్రీలకు పఠన కేంద్రముల నేర్పాటు చేయాలి. వ్రాయను, చదువను నేర్పాలి. పత్రికలు చదివి వినిపించాలి. వివిధ విషయములను గూర్చిన ప్రాథమిక విజ్ఞానాన్ని వ్యాప్తి చేయుటకై చిన్న ఉపన్యాసములను ఏర్పాటు చేయాలి. స్త్రీల ఉపయోగార్థం ప్రత్యేక గ్రంథాలయాల నేర్పాటు చేయాలి.

స్త్రీ విద్య అభివృద్ధి పొందాలంటే సాంఘికంగా కొన్ని ముఖ్యమైన మార్పులు రావాలి. బాల్య వివాహ పద్ధతి పోవాలి. స్త్రీల ఆర్థికస్థితి బాగుపడాలి. స్త్రీల గృహ నిర్వహణభారమును తగ్గించుటకై శిశుపోషణాలయములు, సమిష్టి భోజన శాలలు విరివిగా స్థాపింపబడాలి. స్త్రీ-దేశస్వాతంత్ర్యము కోసం, సాంఘిక విధానంలో అభ్యుదయకరమైన మార్పులకోసం, సంఘంలోని ఇతరఅభ్యుదయకర శక్తులతో కలసి కృషిచేయాలి. ఆనాడే స్త్రీ విద్య అభివృద్ధి చెందడానికి అనువయిన అవకాశం కలుగుతుంది.

మన జాతిలో సగభాగం అజ్ఞానంలో మునిగి వుంటే

దేశం ఎలా అభివృద్ధి చెందగలదు? అందుచే దేశాభ్యుదయ కాముకులందరు స్త్రీ విద్యాభివృద్ధికై కృషి చేయాలి. స్త్రీలు శాస్త్ర వేత్తలుగా, పరిశోధకులుగా, డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, ఉపాధ్యాయులుగా, కళావేత్తలుగా శిక్షణ పొందినప్పుడు దేశాభివృద్ధికి తయారుకావాలి. స్త్రీయొక్క ప్రతిభా శక్తి సౌఖ్యమయ గృహజీవనానికే కాక, దేశ సౌభాగ్యానికి, సాంఘికాభ్యుదయానికి వినియోగ పడాలని ఏ దేశ భక్తుడు కోరడు?

ఇదిగో స్త్రీలకు విశ్వకవి స్వర్గీయ రవీంద్రుని సందేశం :

“ఈనాడు ప్రపంచమంతటా స్త్రీలు ఇంటి గుమ్మాలు దాటి విశ్వ వీధులలోనికి వస్తున్నారు. మానవుల ఈవిశాల గృహనిర్వహణ బాధ్యత నిర్వహించలేని నాడు స్త్రీలు సిగ్గుతో తల వంచుకోవాలిసి వస్తుంది. మానవ నాగరికతలో నూతన యుగం ఆరంభ మవుతుంది. మన స్త్రీలు ఈనూతన సృష్టికై తమయావఛ్ఛక్తి ధార పోస్తారని ఆశిస్తున్నాను. ఈ విషయంలో నాకెట్టి సందేహము లేదు.”

సాంఘిక విధానంలో అభ్యుదయ కరమయిన మార్పుల కోసం, దేశ స్వాతంత్ర్యం కోసం స్త్రీ యితరఅభ్యుదయ శక్తులతో కలసి కృషి చేసినప్పుడే, స్త్రీ విద్య అభివృద్ధి చెందగలదు. మానవ చరిత్రలో నూతన యుగం ఆరంభ మవుతూంది. నూతన సృష్టికై స్త్రీలు తమ యావచ్ఛక్తి ధారబోయాలి. ఆనాడే మహిళా మణులు నూతన యుగానికి నివాళులందిస్తారు. ఆనవయుగానికి ఎదురుచూస్తున్నాం. అదే! అది సమిపంలో నేవుంది !!





## స్టాలిన్ మాతృదేవత

ఎల్లాగైనా తన తల్లిని తన పంథావైపు మార్చుకోవాలని స్టాలిన్ నానాతంటాలూపడేవాడు. దేవుడుపేరు చెప్పుకొని మతగురువులు, చర్చిలు ప్రజలనెల్లా రాబందుల్లా పీక్కుతినేవారో వివరించిచెప్పేవాడు. ఆ ఖరికి చచ్చిన మనిషిని సమాధి చేయడానికికూడా ఈ మతాధికారులు ఫీజును ఎల్లాగుంజేవారో ఏకరువు పెట్టేవాడు. పాపం ఆ తల్లికి ఎలా వాదించాలో తెలిసేదికాదు. చెప్పిందంతా విని విని, చేతులు పైకెత్తి, "అబ్బాయి, నీవు నా కెన్నైనా చెప్పు! నీవు దేవుళ్లో నమ్మకముంచి చర్చికిపోతేగాని, నీ ప్రజలకు నీ వెన్నటికీ మహానాయకుడవు కాలేవు," అని అంటూాండేది. ఒక రోజున తన కొడుక్కి లభించిన ఓ అఖండ విజయాన్ని చూచి ఆ తల్లి పొంగిపోయింది. కానీ కొడుక్కి దేవుళ్లో నమ్మకం లేదన్న విషయం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. కొడుకుతో ఖరా ఖండిగా ఆమె అన్నది: "నీవో నాస్తికవాదివై రష్యాకు రాజాధిరాజు వయ్యేకంటె, భగవద్భక్తితో నిండిన ఓ సన్యాసిగా ఉండటమే నా కిష్టం."

—వందేమాతరం.

## గాంధీజీ తలిదండ్రులు

విద్యాగంధంలేని తలిదండ్రులు నన్నుపెంచారు. అర్థం తెలియకుండా వట్టి యే కరువు పెట్టడమే చాలని ఒక పండితుడు చెప్పడంచేత, నా తండ్రి భగవద్గీతను చిలకలా వల్లించేవాడు. మా అమ్మ యేమీ తెలియని ఒక పల్లెటూరిపడుచు. కాని, 'తనను బట్టే, తక్కిన ప్రపంచంకూడా వుంటుం'దన్న సూక్ష్మ సత్యం ఆమె నాకు బోధించింది. అందువల్ల తన్ను గురించీ, తన చుట్టు పక్కలను గురించీ తాను జాగ్రత్తపడితే తక్కిన ప్రపంచం తన సంగతితానే చూసుకుంటుందని ఆలోచించడం నేర్చుకున్నాను నేను. నా ముసలి ఆయా నాకు రామనామ ప్రభావంలో నమ్మకం కలిగించింది.

—గాంధీజీ.

## రత్నముల గనిలో గాజు పుట్టునా ?

రీటాను చూస్తున్న కొద్దీ నా ధైర్యం తగ్గసాగింది. పాపం యింత చిన్న పిల్ల, యింత పెద్ద ప్రపంచం! ఈ అమ్మాయిని గురించి ఎవరు శ్రద్ధ తీసుకుంటారు ? నా భావాల్ని చదివిందేమో నన్నట్లు నన్ను చూసి నవ్వింది. "ఇటువంటి దినాల్లో జీవించటం ఏమి అదృష్టం! అమ్మా, నీతో నేనుకూడా, జైలుకు రాలేకపోయానే అనుకుంటున్నాను ' అన్నది రీటా. ఇహ ఈ అమ్మాయి విషయంగురించి నేనేమీ బెంగ పెట్టుకోనవసరం లేదని మనసు స్థిమితం చేసుకుని, హృదయం మీది ఒక బరువు పోయినట్లు అనిపించి, ముద్దుపెట్టుకున్నాను.

—శ్రీమతి విజయలక్ష్మీపండిట్.

## గతకాలము మేలు, వచ్చుకాలము కన్నన్

మా కాలంలోవాళ్లు చాలా అదృష్టవంతులనీ, ఈ కాలం

వాళ్లు మా కాలంవాళ్లల్లో ఎన్నోవంతులు అదృష్టవంతులు కారనిన్నీ అనుకుంటూ ఉంటాను...మా దొడ్లో కాసి రాలి పోయిన లేతనారింజపిందెవంటి పనికిమాలిన నారింజకాయలు, ఊరికే యిస్తామంటే ఎవరూ తీసికోనివి నారింజకాయలు డజను రు. 2/- దాకా ఎవరో కాదు నేనే కొంటున్నాను. పూర్వం కరువులు వచ్చినా ధాన్యాలకు మాత్రమే కాని నేతి మజ్జిగలు వగైరాలకు వచ్చినట్లేలేదు. నా చిన్నతనంలో విన్న ఒక కరువు సంగతివల్ల నేనిల్లా ఖండితంగా చెప్పుతున్నాను. ఏదో కరువొచ్చినట్లున్నా, ఎండుమట్టినీ పెరుగున్నా కలిపి, కందిపప్పు సహాయం క్షుద్బాధ తీర్చుకొనేవారనిన్నీ ముసలమ్మలు చెప్పగా విన్నాను. ఈ కరువే వేరు.

—శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

## పత్రికల ప్రథమ కర్తవ్యం

ప్రజల విజ్ఞానవికాసాలకి తోడ్పడం పత్రికల ప్రథమ కర్తవ్యం. పత్రికలలోని విమర్శలు సహాయభూతంగా, నిర్మాణాత్మకంగా, నిష్పాక్షికంగా, సహృదయంతో చేసినవి అవడం చాలా ముఖ్యం. అవి పరువు పోగొట్టేవి, దురుద్దేశంతో కూడినవి, ఆడిపోసేవి కాకూడదు. మర్యాదస్థులైన పత్రికారచయితలు వ్యక్తిగతవిమర్శలు, పాక్షికాభిమానాలు విడిచిపెట్టాలి...జాతిని తీర్చి దిద్దడంలో పత్రికలు ప్రముఖపాత్ర వహింపవలసివుంది.

—శ్రీ సి. వి. హెచ్. రావు.



# ఆమని పిట్ట!





శ్రీ కవికొండల వేంకటరావుగారు

"సా" మా మూడవకుమార్తె. ఆమె మాట్లాడ్డం మితం. నవ్వడం అంతకన్నా మితం. అసలు చెప్పొస్తే కారణంలేందే నవ్వనే నవ్వదామె. స్నానాల గదిలో రేడియో సంగీతం ఎవరిదా అంటే "సా" ది అని అందఱం అనుకోవలసిందే. బారసాలనుబట్టి అయితేం, వివాహ శుభలేఖనుబట్టి అయితేం ఆమె "సావిత్రీ దేవి"గా వెలిసింది. మఱి నేను దాచినా ప్రయోజనం లేదు. తెనుగులో నూటికి అరవై మార్కులు వచ్చేవి. ఆ ప్రకారంగానే 'లాజిక్'లో కూడా తెచ్చుకో తల్లీ! అని నేను హెచ్చరించేలో పెళ్లి కుదిరింది. పెళ్లి అంటే ప్రియుల పరిభాషలో "లవ్." "లవ్"కు "లాజిక్కు"కు చుక్కెదురు. అయినా మన మేమైనా అంటే మీ కథలో "లాజిక్" వుంటేగా మా "లవ్"లో లాజిక్ వుండడం, అని అడుగగలదుకూడాను. ఎంచేతా అంటే ఆమె ఎంతమిత సంభాషిణియో అంత సునిశితపు వాగ్ధోరణిగలది.

ఆమెకు పెద్ద స్యూటుకేసు తెచ్చిపెట్టాను. అన్నీ సర్దేసుకుంది లాగుంది, మఱి మూతవేసి తాళం నొక్కబోతూ వుంది. ఆమె మూత వేసీవేయడంలో నాకేదో నల్లని ఱెక్కలు ఆ పెద్ద స్యూటుకేసులో ఎగురుతూవున్నట్లు కనబడ్డాయి.

అప్పటి కప్పుడే నాకు లోపలవివశత్వము ఎగదట్టివుంది. మఱి ఎప్పుడైతే పక్షిరెక్కలా పెట్టెలో ఎగురుతూవున్నట్టు చూచానో నా ఆవేశానికి అంతులేకపోయింది. అమ్మాయీ! నీవు నా ఆమనిపిట్టనుకూడా పెట్టెలో పెట్టుకు వెళ్లిపోతున్నావా, అత్తింటికి? అందుకా ఇంత పెద్దపెట్టి తెచ్చిపెట్టుకున్నావు?" అని సూటిగా అడిగేశాను.

"అదేమివస్తువండీ! ఆమనిపిట్ట అన్నది? అయినా పిట్టను నా పెట్టెలో పెట్టలేదే?" అని నవ్వుతూ అడిగింది. "పెట్టెతీసి చూపిస్తేగాని వల్లగా"దన్నాను, అదో భ్రాంతిగా—మ కెందుకో అని. ఆమె సందేహించకుండా వెంటనే "ఆమని పిట్ట"కు అర్థంకూడా చెప్పేశాను—"కోయిల" అని. అంటే ఆమె నయనాలు ఆర్ద్రాలు గావించుకుంటూ, చదువుకుంది కాబట్టి, అందులోను తెనుగు బాగా వచ్చింది కాబట్టి—"మీకు నేనంటే చాలా వాత్సల్యమండీ! నాన్నగారూ. అందుచేత నేనత్తింటికి వెళ్లిపోతూవుంటే మీకు మరి ఆనందం ఉండదనే అభిప్రాయం కొద్దీ అలా మీ కోయిల పిట్టను నేను పెట్టెలోపెట్టి తీసుకుపోతూవున్నానని వుత్ప్రేక్షించేరు. అంతేగాని నా పెట్టెలో పిట్టేమిటుండీ? పిట్టకోసమని పెట్టెతీస్తే పిచ్చిదాన్ని అంటారు నన్ను—మిమ్మల్నీ అలాగే అంటారు." అంటూ లేచివచ్చి ఆశీస్సుకోసం నాకు నమస్కరించింది. నమస్కారమందుకున్నాను. పుత్ర పౌత్రాభివృద్ధిగా ఆశీర్వదించాను. కాని నా చూపంతా ఆ పెట్టెమీదనే వుండిపోయింది.

"లేదే అమ్మాయీ! లోపలేదో కొట్టుమిట్టాడుతూ వున్నట్టుందే!" అన్నాను. "మీ హృదయంలోనా ఆ పెట్టెలోనా? ఎంత వెఱ్ఱివారండీ మీరు? ఈలాగైతే ఏలాగు?" అంది మా ఆవిడవచ్చి. మా పెద్దబ్బాయివచ్చి "రైలుకు వేళయిపోయిందంటున్నారు, బావగారు తొందరపడుతున్నారు" అని గంతులు వేసేడు. పిల్లలందరూ నా చుట్టూ మూగి ఏదో వింతగా వినసాగేరు. ఆవల తెల్లవాఱుగట్ల "కూ! కూ!" అని కూసినట్లైంది. కూతకు ప్రతిగా

కనుపాప నీడలు

పెట్టెలో కూత "కూ! కూ! కూ!"—అదిగో వినండి! అదిగో! అదే నా ఆమనిపిట్ట!" అని అరిచాను.

మరి మా సావిత్రి నన్ను మరోలా సమాధాన పఱచ లేక పెట్టె తాళం తీసి, చటాల్ని మూత ఎత్తింది. మూత నంటుకుని నిజంగా రెండు నల్లని రెక్కల్లా ఏదో వస్తువు పైకిలేచింది. "అదిగో పెట్టెలో పిట్ట! నా ఆమనిపిట్ట! నాకోయిల! నాపికం! నాపరభృతం! నా! నా!" అని పెంకులెగిరేటట్టు గోలచేశాను, అందఱికీ తెలియవద్దూ నాదాపరికం?

కాని మా సావిత్రీదేవి అతి శాంతంగా, మిక్కిలి ముద్దుగా, ఎంతో వినయంగా "అది మీ అల్లుడిగారి 'అంబ్రెల్లా' అండీ నాన్నగారూ! మణిచి యిచ్చి పెట్టెలో జాగ్రత్త పెట్టుమన్నారు. నల్లనిగుబ్బగొడుగు—ఇదిగో చూడండి" అంది.

నిజంగా అది మా అల్లుడిగారి సరికొత్త నల్లనిగుడ్డ గొడుగే! మూతపైకెత్తగా మూతనంటి పైకిలేచింది కాబోలు! వెంటనే మా అమ్మాయితో పెట్టె మూతవేసికోమని, పెట్టెలోని గొడుగూ అన్నీ భద్రం అని, జాగ్రత్తగా వెళ్లి రమ్మని అన్నాను. మరిన్నీ బాట పొందుపఱచమని భగవంతుని ప్రార్థించాను.

బాట పొడుగుతా ఆమె రైలుపెట్టెమీద కెగిరి కూర్చుని కూసిన ఆమని పిట్ట లెన్ని వేలో! ఎన్నిలక్షలో! "ప్రయాణము ఆనందముగా సాగినది" అని ఆమె గమ్యస్థానంచేరిన వెంటనే వుత్తరం వ్రాసింది!



## 'ఆర్థిక స్వత్వాలు లేని స్త్రీల అవస్థ'

— శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు —

సీ॥ పుట్టింట నత్తింట పూర్వార్జితములలో
వారసత్వాది స్వత్వములు లేక
ధరలు పెరుగుటచే ధనమెంతయున్న "స్త్రీ"
ధనమేసియును తనదాకరాక
స్వార్థపూరితమైన సంఘంబునందు వి
ద్యాధనంబైన లభ్యంబుగాక
బిడియంబు విడిచితా బిడ్డలదరిచేరి
కోడండ్ర యల్లుండ్ర కొలువుసేయు

తే॥ గీ॥ పరమనీచపు బానిస బ్రతుకుకన్న
హీనమైనది లేదిక మానవతికి
గానసతికింత కష్టంబు కలుగ నీక
పతియె ఆర్థికదుస్థితి బాపవలయు!



# హిందూ స్త్రీలు - విడాకుల హక్కు

శ్రీమతి అమరవాది రత్నమ్మగారు



"విడాకులహక్కు వచ్చినంతమాత్రంచేత చీటికిమాటికి భార్యాభర్తలు విడాకులిచ్చుకుంటారనుకోటం కేవలం పొరపాటు. పరస్పరప్రేమ, ఆనుకూల్యం, అన్యోన్యం మొదలైనవానితోవున్న భార్యాభర్తలకుకాదు ఈ విడాకులచట్టం. క్రూరుడు, దుర్మార్గుడైన భర్తవలన బాధపడే స్త్రీలకు. రోకలిబండతో పచ్చడి నూరుకుంటాముగాని తలబ్రద్దలుకొట్టుకోము."



శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు శాసన సభలో బహుభార్యానిషేధం, విడాకులబిల్లు ప్రవేశ పెట్టినప్పటినుంచి విడాకుల హక్కు విషయమై సోదరీమణులు రకరకాల అభిప్రాయాలు వెల్లడిస్తున్నారు. అసలు విడాకుల చట్టం భారతీయ స్త్రీల అభివృద్ధికి ఎంతవరకు తోడ్పడ గలదు? అనేవిషయంలోనే సోదరీమణులు ఒక అభిప్రాయానికి రాలేకపోయారు. విడాకుల చట్టం అమలు పరచడం ఇప్పటికే చాలా ఆలస్యమగుటచే దీనిని వెన్వెంటనే చెయ్యాలని కొందరు సోదరీమణులు తమ అభిప్రాయం వెల్లడిస్తున్నారు. అసలు విడాకుల చట్టం స్త్రీల అభివృద్ధికి ఎంతమాత్రం తోడ్పడదని ఇదిభారతీయ హైందవ సాంప్రదాయానికి కళంకం తెస్తుందని కొందరు సోదరీమణులు నొక్కి వక్కాణిస్తున్నారు.

కాని యీ విడాకుల చట్టాన్ని గూర్చి కొంచెం విశాల దృక్పథంతో విచారిస్తే మనలోవున్న భిన్నాభిప్రాయాలకు తావే వుండదు. మన సమాజంలో నూటికి 99 వివాహాలు తలిదండ్రుల యిష్టం మీదనే జరుగుతున్నాయి. స్త్రీలకు తమ యిష్టప్రకారం వివాహం చేసుకొనే హక్కు, అవకాశము, అనుకూల పరిస్థితి ఇంకా ఏర్పడలేదు. కొన్ని వివాహాలు స్త్రీ ప్రేమించిన వరునిగాక ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా జరుగుతున్నాయి. తలిదండ్రుల అభీష్టానికి, నిర్బంధానికి వ్యతిరేకంగా తాము ప్రేమించిన పురుషుని చేసికొనే ధైర్య సాహసాలు, శక్తి సామర్థ్యాలు లేక ఎంతో మంది స్త్రీలు వేరొక పురుషుని వివాహం చేసుకుంటున్నారు. కాని ఇది నామమాత్ర వివాహమే గాని ఆ స్త్రీ పురుషుల జీవితంలో ఏవిధమగు శాంతి సుఖం లేక పోవటం, దీని ఫలితంగా ఆమె ఆత్మహత్య చేసికొనడమో, లేక కుటుంబము కలహ పూర్ణంగా వుండడమో జరుగుతుంది. భార్యా భర్తలిరువురు కీచులాడుకొంటూ, దెబ్బలాడుకొంటూ, అశాంతితో జీవితాన్ని వెళ్ళబుచ్చే కుటుంబాలెన్నో వున్నాయి. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవుటచేత ఆమె ఏనుయ్యో గొయ్యో చూచుకుంటుంది. ఇలాంటి ఘటన నా అనుభవములో ఒకటి జరిగింది కూడాను. మావాళ్ళల్లోనే ఒక అమ్మాయి, భర్తయందు యిష్టంలేకో, అతనితో వ్యతిరేకించే శక్తిలేకో, పైగా సమాజం తన్నేమి దూషిస్తుందో అనే భీతిచేతో తన నిండుప్రాణాన్ని నదీమాత కర్పించింది.

అవినీతి, అంధవిశ్వాసాలు, అవిద్య, అజ్ఞానం మొదలైన వాటికి పుట్టిల్లు అయిన మన హిందూసమాజంలో ఇటువంటి ఉదాహరణలెన్నో చూపవచ్చు. కాని, ఈ భయంకర పరిస్థితుల్ని కొంచమైనా గమనించక కొంతమంది సనాతనులు

ఈచట్టాన్ని అమలు జరుపకుండా వుండాలని ప్రయత్నిస్తున్నారు. పైగా సంకుచితమైన తమ అభిప్రాయమే సరియయినదని వాదిస్తున్నారు. ఇటువంటి అభివృద్ధి నిరోధకుల ఆటలు సాగనివ్వకుండా అభివృద్ధి కాముకులందరూ సాధ్యమైనంత త్వరలో యీచట్టాన్ని అమలు పరచడానికి పాటు పడాలి.

విడాకుల చట్టంలోవున్న మంచిని పెడమార్గంలో పెట్టి సంకుచిత దృక్పథంతో పరిశీలించరాదు. విడాకులహక్కు వచ్చినంత మాత్రంచేత చీటికి మాటికి భార్యాభర్తలు విడాకులిచ్చుకుంటారనుకోటం కేవలం పొరపాటు. పరస్పరప్రేమ, అనుకూల్యం, అన్యోన్యం మొదలైనవానితో వున్న భార్యాభర్తలకుకాదు ఈ విడాకుల చట్టం. క్రూరుడు, దుర్మార్గుడైన భర్తవలన బాధపడే స్త్రీలకు. రోకలిబండతో పచ్చడి నూరుకుంటాముగాని తల బ్రద్దలు కొట్టుకోము.

కాని యీబిల్లును అమలు పరచేముందు కొన్ని సవరణలు చేసి అమలు పరిస్తే బాగుంటుంది. ఆసవరణలు ఈ క్రింద యిస్తున్నాను.

(1) ఈచట్టంఅమలుజరుగుటకు పూర్వంజరిగిన వివాహాలకిది వర్తించదని ఉన్నది. కాని, ఎంతోమంది స్త్రీలు క్రూరులగు భర్తలవలన అనేక బాధలకు గురియగుచున్నారు. చట్టము అమలుజరుగుటకు పూర్వము వివాహమైన స్త్రీలకు ఈచట్టము వర్తింపనిచో తమ జీవితములను వారు అంతములేని బాధలతో గడపవలసి వచ్చుట ఎంతయు శోచనీయమగు విషయము. కనుక ఈచట్టం అమలు జరుగుటకు పూర్వం జరిగిన వివాహములకుకూడా దీనిని వర్తింపజేయవలెను.

(2) భార్యా భర్తలలో ఏఒక్కరైనా తిరిగి వివాహం చేసికోదలచినచో, మొదటి వివాహమును చట్టరీత్యా రద్దు పరచుకొనవలెను. అట్లు చేయనిచో వారు శిక్షకు పాత్రులగుదురు. కాని ఈశిక్షకు 18 సంవత్సరములలోపు పురుషులు పాత్రులుకారు. కాని, స్త్రీలు మాత్రము దండనీయులు. ఈ శిక్ష పురుషులకు వర్తింపక స్త్రీలకు మాత్రమే ఎందుకు వర్తింపవలయునో అర్థమగుటలేదు; గనుక, ఈశిక్షకు ఇద్దరు బాధ్యులగునట్లు సవరించవలెను.

(3) భార్యాభర్తలియువురిలో ఏఒకరుగాని చికిత్సకసాధ్యమగు మూడు సంవత్సరముల రోగముచే (కుష్ఠు, పిచ్చి మొ॥) బాధపడుచున్నచో వారికి విడాకుల హక్కు వర్తించును. కాని, కుష్ఠువంటి అంటువ్యాధిచే భార్యాభర్తలలో ఏఒకరో బాధపడుచున్నపుడు తక్కినవారిని మూడు సంవత్సరముల వరకు వేచియుండమనుట న్యాయముగాదు. ఈమూడు సంవత్సరములలో, భయంకర రోగముచే బాధపడుచున్న వ్యక్తితో (స్త్రీగాని, పురుషుడుగాని) వున్న సంపర్కఫలితంగా రెండవవారు యీవ్యాధికి గురికావచ్చు. కనుక రోగము వైద్యుని వలన రూఢియైన వెంటనే విడాకులిచ్చుకొనుహక్కు కల్గునట్లు సవరింప వలయును. కాని రోగము నయమయిన వెంటనే, తిరిగి స్త్రీగాని, పురుషుడుగాని ఒకరితో నొకరు సంబంధమును పెట్టుకొన వచ్చును. ఈలోపుగా యింకొకరిని వివాహమాడరాదు.

(4) భార్య వ్యభిచారిణి అయినపుడు, విడాకులహక్కు భర్తకుండునేగాని, భర్త అన్యస్త్రీని ఇంటిలో వుంచక పరోక్షంగా వ్యభిచారము చేయుచున్నప్పుడు భార్యకు విడాకుల హక్కువుండదు. కనుక, భర్తవ్యభిచారి అయినప్పుడు భార్యకుకూడా యీ బిల్లు వర్తించునట్లు సవరింప వలయును.

ఈ పైసవరణలతో యీబిల్లు ఎంత త్వరగా అమలు పరిస్తే అంత మంచిది. ఈచట్టం ఎప్పుడో అమలు పరిచి వుండవలసింది. కాని సనాతనుల అభివృద్ధినిరోధక వాదనకు ప్రాధాన్యంయిచ్చి సామ్రాజ్యవాద ప్రభుత్వం ఈచట్టాన్ని యింతవరకు అమలు పరచకుండా జాగుచేసింది.

కాని యిప్పుడు రాష్ట్రంలో మన జాతీయసంస్థ కాంగ్రెసు అధికారం చేపట్టింది. అధికారం చేపట్టి సంవత్సరము పైగాఅయినా ఇంకా దీన్నిఅమలు చెయ్యలేదు. దీన్ని శాసన సభలో ప్రవేశపెట్టినందుకు కాశీశ్వరరావుగారు ఎంతయినా అభివందనీయులు.

ఇప్పటికైనా ప్రభుత్వం ఈచట్టాన్ని వెంటనే అమల్లో పెట్టాలి. సోదరీమణులంతా దానికి మహజర్లద్వారా, వ్యాసములద్వారా ఆందోళన చెయ్యాలి.



# స్త్రీల దేశీయ గేయాలు

## సంభాషణ

శ్రీ ప్రయాగ బి. యే.

శాంత : అమ్మా, సుందరీ ! పిల్లాడలా కింకపట్టి యేడుస్తూంటే ఆమాయగ్రామఫోను ఆపి, కాసింత ఊరుకో బెట్ట కూడదుటే. ఏం పాటలో, మాట తెలియనా ! వరస తెలియనా !

సుందరి : నాపాటలంటే నే నీకు తలతిక్క. నీ చిలకరాయబారం, సీత సమర్త పాడానుకానని. ఎంత ఆనందంగా ఉన్నాయో చూడు...రారా బాబూ. ఊరుకో, ఇదిగో ఈ పాటతోకూడ ఆడు...(మళ్లీ ప్లేటువేస్తుంది).

శాంత : ఏం సినీమాలు ? ఓ నీతుందా, నియమంవుందా ! వాడికి పాలు ఇప్పుడే పోశాను. అలా కుదిపెయ్యకు. ఉయ్యాల్లోవేసి ఊచవే.

సుందరి : రెండు అట్టజేతులుకట్టుకు నిలబడితేచాలు. రెండు చేతులెత్తి దండాలు పెడతారు. సాక్షాత్ శ్రీమన్నారాయణుడని. రారా పసుకో. బాధా కరతెహో. మంగళరూప తుమ్హారా !

శాంత : కొన్నాళ్లకి మన కట్టుబొట్టుల్లో జాతీయత పోవడమేకాకుండా సాంప్రదాయక సంగీతం, ప్రాచీన గేయాలుకూడ అడుగంటిపోతాయి. పిల్లాడ్ని ఒళ్లో కూర్చోబెట్టుకుని,

ఏనుగొచ్చిందేనుగు,
ఏలాగొచ్చిందేనుగు ?
ఉప్పాడొచ్చిందేనుగు,
ఉప్పునీళ్లుతాగిందేనుగు.
మావూరొచ్చిందేనుగు,
మంచినీళ్లుతాగిందేనుగు.

అంటే చాలు ఒక్క ఎగురుఎగిరి ఊగుతాడు పిల్లాడు.

సుందరి : పాపం. నీపాట వింటేనే ఊగుతాడు కాబోలు. నాయనమ్మ పాటని.

శాంత : అయ్యో. నాయనమ్మ పాటలని ఈ సడిస్తున్నావు. భారత భాగవతాలు కంఠస్థం వచ్చేవి మాకు. ఆమాటల పొంకం, అర్థం యీకీసరబాసరలో వున్నాయిటే. పాట పదేళ్లనాటిదయినా, వింటూవుంటే ఆనాటి ఆచారాలు వ్యవహారాలు కళ్లకి కట్టొద్దు ?

సుందరి : ఆ. ఏం పాడినా పెద్దాపురం చేంతాడులాగు ఒకటే పాట, రోకళ్ల పాట !

శాంత : రోకళ్ల పాటలని తేలిగ్గా అన్నావు. ఆ పాటల్లో అమాయికత్వం, ఫలో క్తిచూడు.

కోడలకోడలా కొడుకుపెళ్లామా ఓలమ్మా
పచ్చిపాలమీద మీగడేదమ్మా
వేడిపాలమీద వెన్నయేదమ్మా ॥ఆసువ్వి, ఆసువ్వి॥
అత్తా నీచేత ఆరళ్లైగాని ఓలమ్మా
పచ్చిపాలమీద మీగడుంటుందీ
వేడిపాళమీద వెన్నవుంటుందీ ॥ సువ్వి సువ్వి ॥

కొడుకంటుపుట్టాడు కొంటికోరంగి ఓలమ్మా
కోడలంటువచ్చింది రవ్వల్లారాణి.
ఒకరిపచ్చనచూచి వలపోయరాదు
వాజిమాలినదేవుని వరమడుగరాదు.
అత్తలేనికోడలుత్తమ్మురాలు
కోడల్లేనియత్త గుణవంతురాలు ॥ ఆసువ్వి ॥
చిలకతిన్నపండు నేనెట్టాతిందు ఓలమ్మా
చిలకతోమాటొస్తె నేనెట్టాపడుదు.
మాతాతపెళ్లికి నేనెంతదాన్ని ఓలమ్మా
తలదువ్విబొట్టెడితె తవ్వంతదాన్ని.
అన్నిసొమ్ములుబెడితె అడ్డంతదాన్ని.
నట్టింటకూర్చొని నగలకేడిస్తే. ఓలమ్మా
ఊరుకోమనమరాల ఊరేగొస్తానన్నాడే.

సుందరి : నవ్వుతూ మాబాగావున్నాయె మామ్మా నీపాటలు చమత్కారంగాని !

శాంత : సరే అన్నిపాటలు పాడావు. గ్రామఫోను, నవీన సంగీతం వినిపించావుగాని, చంటాడు కన్నుమూశాడా ? ఏదీ ఇలాతే నిముషంలో పడుకుంటాడు.

సుందరి : ఆ నువ్వేం మెస్మరిజమ్ చేస్తావా ?

శాంత : లబ్ లబ్ లబ్-హాయి.

హాయి హాయి హాయి ఆపదలుగాయి
చిన్నవాళ్లనుగాయి శ్రీవెంకటేశా !
హాయమ్మనెవ్వరే కొట్టిన్నవారు
కొట్టిగోవులపాలు కొనిపోసినారు.
హాయివారింటికీ బోయివత్తాము
అరటిపళ్లత్తమ్మ లెత్తుకొద్దాము.
పిల్లిరావె పిల్లిపిల్లలకుతల్లీ
పిల్లలకుపాలిచ్చి పల్లెలకుబొమ్మ.
ఏడవకుయేడవకు వెఱ్ఱినాతండ్రీ
ఏడిస్తెనీకళ్ల నీలాలుగారు.
నీలాలుగారితే నేచూడలేను
పాలైనకారవే బంగారుకళ్ల.
అమ్మాయిమామల్లు యెటువంటివారు
చెవులకు చారెడేసిపోగుల్లవారు.
అందరిమామల్లు చందమామల్లు
అమ్మాయిమామల్లు రామలక్ష్మణులు.
జోలల్లుపాడితే బాలలకునిద్ర
నాగస్వరంపాడితే నాగులకు ఆట.

సుందరి : పిల్లాడి పోరుకేనా నేర్చుకోదగ్గదేపాట. ఇట్టే పడుకున్నాడు మామ్మా.









# రాజకీయాలు

## ఇండోనీషియాలో యుద్ధం:

తిరిగి యుద్ధం! ఈమారు మన ఆసియాఖండంలోనే ప్రారంభమయింది. ఇండోనీషియా ప్రజలపై డచ్చిప్రభుత్వము బాంబులవర్షం కురిపిస్తోంది. కారణం? డచ్చిసామ్రాజ్యాన్ని స్వాతంత్ర్య పిపాసులైన ఇండోనీషియనులు ప్రతిఘటించుటే. ఈమారణహోమం ఏకధాటిగా జరుగుతోంటే ఐక్యరాజ్య సమితి నాయకులు, ప్రపంచశాంతికి బాధ్యత వహించ వలసిన ఇంగ్లాండు, అమెరికా, రష్యాదేశాలు యింకా తటపటాయిస్తున్నాయి. ఈ దురాగతమునుండి ఇండోనీషియా ప్రజలను రక్షించుటకు ప్రయత్నిస్తున్నది మనభారతదేశమే; మన ప్రధానమంత్రి జవహర్లాల్ పండితుడే డచ్చిసామ్రాజ్యానికి పాఠంచెప్పగలడు.

## తిరువాంకూరు హైద్రాబాదులలో జాతీయోద్యమం:

భారతదేశ స్వాతంత్ర్య చట్టం ప్రకారం మన స్వదేశ సంస్థానాలమీద బ్రిటిషు అధికారం తొలగిపోయింది. మైసూరు, కొచ్చిన్, బరోడా మొదలగు సంస్థానాలు ప్రజాభిప్రాయమున కనుగుణంగా భారతదేశంలోనే కలసి వుండడానికి సమ్మతించాయి, కాని హైదరాబాదు నవాబుగారు, తిరువాంకూరు దివానుగారు సర్వస్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తారు. హైద్రాబాదులో నూటికి తొంభైమంది, తిరువాంకూరులో నూటికి నూర్గురూ యీసంస్థానాలు భారతదేశంలో కలసిఉండి జాతీయ గౌరవమును నిలబెట్టాలని ఘోషిస్తున్నారు. భారతదేశంలోనే కలసిఉంటే వారికి గూడా ప్రాథమికహక్కులు కలుగుతాయనీ, దాస్యం అంతరించి ప్రజాస్వామ్యం ఏర్పడుతుందనీ యీప్రజల అభిప్రాయము. ప్రజాస్వామ్యం యేర్పడితే నవాబుల దర్జా, దివానుల తీవి అంతరించిపోతాయి. అందుచేతనే ప్రజలపై లాఠీ ప్రయోగాలు, అరెస్టులు, తుపాకీకాల్పులు!

## రాజ్యాంగ పరిషత్తు:

స్వతంత్ర భారతదేశంయొక్క రాజ్యాంగ ప్రణాళిక తయారౌతోంది. రాష్ట్రాలకు ఒక గవర్నరు వుంటాడు. ఈయన ప్రజలచేతనే ఎన్నుకోబడతాడు. రాష్ట్రాల అభిప్రాయాల కనుసరణంగా ఒకటి లేదా రెండు శాసనసభలను యేర్పరచుకోవచ్చు. మతవిభేదాలకు తావిచ్చి, జాతీయైక్యతను రూపుమాపిన ప్రత్యేక నియోజక వర్గాలు తొలగిపోతాయి. హిందువులు, మహమ్మదీయులు, క్రిష్టియనులు అందరూ సమిష్టి నియోజకవర్గంగా శాసనసభలకు ప్రతినిధుల నెన్నుకుంటారు. రాష్ట్రాలలో యేర్పడే మంత్రివర్గాలకు రాష్ట్రమునకు ప్రత్యేకం సంబంధించేటంత వరకూ సంపూర్ణాధికారం వుంటుంది. గవర్నరు ప్రజలచే యెన్నుకొనబడినవాడే కాబట్టి కొన్ని అపూర్వ సందర్భాలలో అతను కలుగజేసుకొని రాష్ట్రంలో శాంతి భద్రతలను కాపాడడానికి అధికారం యివ్వబడింది. కేంద్రప్రభుత్వాన్ని నిర్మించేవిధానమూ, రాజ్యాంగ ప్రణాళికకు సంబంధించిన తదితర హంశములు త్వరలోనే రాజ్యాంగ పరిషత్తు నిర్ణయిస్తుంది.



ఆంధ్ర మహిళ
: ప్రచురణ :
ఆంధ్ర మహిళా సభ
మైలాపూర్ :: మదరాసు.
సంవత్సర చందా: అయిదు రూపాయలు

# పెప్పర్ మింట్
లేదా



విూకు కావలసిన రుచి ఏమిటో సరిగ్గా తెలుసుకోవటంలో ఎంత ఆనందం ఉంది! ఈవేళ పెప్పర్ మింట్ ఇష్టం. రేపు కేరామెల్ ఇష్టం కావచ్చు. కె.సి.పి. వారు అన్ని రకాలూ తయారు చేస్తారు. వాటి అన్నిటిలోనూ తప్పకుండా ఉన్న ముఖ్యలక్షణం లోపంలేని పరిశుభ్రత.

దేశమంతటా ఆదరించబడిన



## సావరిన్ స్వీట్స్

కె. సి. పి. తయారీ

KCK-2-T6

---

నాణ్యములోగాని, వాడినవారికి గుణము నిచ్చుటలోగాని దీనిని మించినది లేదు........




# జాబ్‌కో హెయిర్‌గ్రోయర్

మీకు స్పష్టముగా అనేక సుగుణములు చూపును: వయసు చెల్లక మునుపే తల నెరయుట మాన్పును; జుట్టున కెప్పటి నల్లని నిగనిగ తెచ్చిపెట్టును; చుండ్రు రాలుట, పొట్టులేచుట పూర్తిగా పోగొట్టును; తలలోని పేలను, యితర క్రిములను చంపి వానిని తిరుగ కనబడకుండచేయును; వాడుచుండగానే తలమీది అన్ని రకముల చిడుములను, దురదలను మాయముచేయును. చెమటవలన తలలో పుట్టిన చెడువాసన కిది తిరుగులేని విరుగుడు.



జయ భారతం కంపెని

మదరాసు :: బెంగుళూరు :: ఎర్నాకులము

## ప్రపంచ చరిత్ర

### మొదటి భాగము

రచన : జవహర్‌లాల్ నెహ్రూ
అనువాదము : చింతాదీక్షితులు
ప్రకాశకులు : కల్చరల్ బుక్సు లిమిటెడ్; పెరంబూరు, మద్రాసు.



204 పేజీలు, వెల రెండు రూపాయిలు.

నెహ్రూపండితుడు, తన కుమార్తె జ్ఞానాభివృద్ధికై, నైనీ చెరసాలనుండి లేఖలరూపమున లిఖించిన ప్రపంచ చరిత్ర లోని మొదటి భాగము. వివిధ దేశముల అభివృద్ధి, నాగరికత, మతవిషయములు, పరిపాలనా విధానములు, సంఘము కట్టుబాట్లు, రాజకీయములు, మున్నగు సమస్తవిషయములు, క్రీ. పూ. 1000 సంవత్సరముల నుండి యీనాటి వరకు ఆయా దేశములలో కలిగిన పరిణామము, అభివృద్ధి క్షయములు, వాని కారణములు, యీలేఖలలో పొందు పరుపబడి యున్నవి. ఈపూర్వ చిన్న పిల్లల కవగాహన మగునట్లును, వారిలో దేశభక్తి, స్వాతంత్ర్యాపేక్ష, ప్రజా ప్రభుత్వ, సహకార విధానములలోని యుక్తియుక్తత, మొదలైన అభిప్రాయములు బాగుగా మనసుకు పట్టునట్లును అమర్చబడి యున్నది. ఇందు శైలికూడ విషయమునకు తగినట్లుగ సులభముగ నుండుటవలన బాల బాలికల పఠనకు యీపాత్తమెంతయు తగియున్నది.

—చెన్న ఘంటమ్మాకృష్ణారావు.

## శ్రీ కామాక్షీవిజయసంచిక

వైశ్య సేవా సదన స్థాపకురాలయిన శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి షష్టిపూర్తి సందర్భమున సన్మానసంఘమువారు ప్రచురించిన సంచిక శ్రీ కామాక్షీవిజయము. మూల్యము 1-0-0.

160 పేజీలుగల యీ సంచికలో మొత్తము 62 వ్యాస పద్యములున్నవి. వాటిలో చాలభాగము పేరు కనుగుణ్యముగ శ్రీమతి కామాక్షమ్మగారి జీవిత విశేషములను, సదన విషయములను గురించి ఉల్లేఖించుచున్నప్పటికి, కొందరు రచయితలు పరిచయులుగాను, కొందరు సన్నిహిత బంధువులుగాను మరికొందరు ఆమె అంతర్యమెరిగిన సదన నివాసినులు, విద్యార్థినులుగాను వ్రాయుటవల్ల విషయమొకటయినా కూర్పులో మార్పువుండి ఆస్థ కలిగించుచున్నవి. సాహిత్యప్రపంచములో పెద్దలని పేరుమోసిన విద్వాంసుల, విదుషీమణుల రచనలు అనేకము వున్నవి. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి "ముద్దుపళని కవితామాధుర్యము" శ్రీయుత పిల్లలమర్రి వెంకట హనుమంతరావుగారి "ముంతాజి మురిపెము" అనే కావ్యవిమర్శలు ఎంతో నిష్పాక్షికముగాను రసవంతముగాను వున్నవి. మొత్తం మీద సన్మాన సంఘమువారు ఇవ్వతగిన కానుకనే సృష్టించారనిచెప్పవచ్చు.

—అచ్యుతుని గిరిజ.

## సమర యాత్ర

ఈ సమరయాత్ర భారత స్వాతంత్ర్య సమరయాత్ర. ఇది చక్కని మూడు కథల చిన్న పుస్తకము. రచయిత పి. శ్రీనివాసరావుగారు. పసుపు కుంకాల పారాణిపూత పైఅట్ట. కాగితము చేతితో చేసినది. కథలలో జాతీయత వుట్టిపడు చున్నది. మొదటికథ సమరయాత్ర. రాజేంద్ర అనే వ్యక్తి దేశాన్ని తీర్చి దిద్దాలని తన కష్టసుఖాలు గణించకుండా జాతీయోద్యమంలో పాలుగొని జైలుకువెళ్లి అష్టకష్టాలనుభవించి స్వశక్తిని కోల్పోయి పిచ్చివాడవుతాడు. జాలికరంగా వుంటుంది కథ. మూడవ కథలో జహంగీరు అను యువకుడు స్వర్ణలత అనే యువతి, స్త్రీ పురుషులు కలసి పనిచేస్తే దేశం బాగుపడుతుందని, జాతీయ సమరంలో చేతులు కలిపి కాలేజి చదువుకు స్వస్తిచెప్పి కారాగార వాసము నాహ్వానించి ఆదర్శ జీవులనిపించు కుంటారు. కథకుని కలం 'హుందా' గా 'హుషారు' గా నడిచింది.

వెల ఎనిమిదణాలు. ములుకోల ప్రింటింగ్ ప్రెస్, గవర్నరుపేట, బెజవాడకు వ్రాస్తే యీ పుస్తకం దొరకగలదు.

—అనూ.

## స్వీకారము

# స్వీకారము

## చందమామ

" చందమామ రావె - జాబిల్లి రావె
కొండెక్కి రావె - కోటివేలు తేవె "

చందమామ వచ్చింది. శ్రీరామచంద్రుడికి అద్దంలో గాని చిక్కని చందమామ, మన చిట్టిపాపల చేతికే వచ్చింది. చందమామ చక్కనిమామ: సరియైనసైజు, సరసమైన సంచాలన. చందమామ విందులమామ: కథలతో-కబుర్లతో, పాటలతో-పదాలతో. చందమామ తిరగ వేస్తూంటే రంగుల రాట్నంలాగ, బొమ్మల కటంలాగ కూడా ఉంది. చందమామ పాఠాల పుస్తకంలా, పండుగ బహుమానంలా వుండే పసందైన పిల్లలమాసపత్రిక. చందమామకి స్వాగతం.

సంవత్సర చందా: ఐదు రూపాయిలు. మేనేజరు, చందమామ, 37 ఆచారప్పన్ వీధి, మద్రాసు-1 అని వ్రాస్తే చాలు చందమామ వస్తుంది.

## సమత

సమత రాజకీయ మాసపత్రిక. నెల నెలా మొదటి తేదీ వెలువడుతుంది. సంపాదకత్వం శ్రీ వేలూరి సదానందంగారు. ఇది ప్రధానంగా సాంఘిక, రాజకీయ, ఆర్థిక విషయాలను విమర్శించే పత్రిక. స్వతంత్రభారతమున సమతకు స్వాగతం. " అధికారం కొద్దిమంది పరమై యుండటం ప్రజాస్వామ్యం కాదు. వ్యక్తిని అణగార్చే సాముదాయక పద్ధతి లాభం లేదు. కనుక సర్వ సమత్వమే మనఆదర్శం". కోటానుకోట్లు తిన కూడు, కట్ట బట్ట, ఉండ వునికీ లేక పశువులకన్న హీనంగా జీవయాత్ర సాగిస్తున్నారు. ఈ అమానుషత్వాన్ని రూపుమాపి సుఖశాంతులు సుస్థిరంగా స్థాపించడానికి మార్గం మరి సమతే. " సమత " వెల నాలుగణాలు. ' సమత ' మద్రాసు-8, అని సంపాదకులకు వ్రాస్తే దొరుకుతుంది.

## ఆంధ్రా హెరాల్డ్

స్వరాజ్యం సిద్ధించింది. స్వరాష్ట్రం స్థిరపడింది. ఈశుభ సందేశాలతో, ఆంధ్రకేసరిఆశీర్వాదంతో, ఆంగ్ల వారపత్రిక ఆంధ్రాహెరాల్డ్ అవతరించింది. సమర్థులైన శ్రీ వైద్యుల రమణరావుగారు దీనికి సంపాదకులు. ఆంధ్రుల ఆశయాలు చాటిచెప్పడం, ఆంధ్రుల అభ్యుదయానికి పాటుబడడం పత్రిక ఉద్దేశ్యము. భారతసమాఖ్యకి ప్రాణ ప్రతిష్ఠ చెయ్యడంలో ఆంధ్రులుకూడా పాలు తీసుకోవాలంటే, తామన్నివిధాల అభివృద్ధి చెందగలగాలి, అన్ని రంగాల్లోను తమహక్కులు సురక్షితంకావాలి. ఆంధ్రరాష్ట్రసిద్ధి తథ్యం. రాష్ట్రం సర్వతోముఖముగా అభివృద్ధి చెందాలంటే ఆంధ్రులందరు సంఘీభవించి పరిశ్రమచెయ్యాలి. అన్ని పత్రికలతోపాటు ఆంధ్రా హెరాల్డ్ కూడా ఆంధ్రులక్షేమానికి, సమైక్యతకి, అభ్యున్నతికి అనవరతం కృషిచెయ్యాలి. అచిరంలో ఆంధ్రుల ఆదరాభిమానాలకి పాత్రమై, ఆంధ్రాహెరాల్డ్, విశాలాంధ్ర పతాకను వియత్తలాన ఎగురవేయ గలుగుతుందనే మా విశ్వాసం. పత్రిక ప్రతి ఆదివారం వెలువడుతుంది. సంవత్సర చందా పదిరూపాయలు. విడి పత్రిక మూడణాలు. చిరునామా: మానేజరు, ది ఆంధ్రాహెరాల్డ్, 4 స్ట్రింజర్ స్ట్రీట్, జి. టి. మద్రాసు—1.

## — స్వీకృతి —

పత్రికలు తోడతొక్కిడిగా వచ్చిపడుతున్నాయి. పత్రికలెన్నివచ్చినా పనిలేకుండా పోదు. ప్రజల అక్కరలకు పరిమితి లేదుకదా! అన్ని పత్రికలకు విడివిడిగా ఆహ్వానం అందించాలంటే యీరోజులలో అసాధ్యమైనపని. అందుచేత ప్రత్యేకంగా స్వీకరింపక విడిచిన సాటిపత్రికల స్వీకృతి యిందుమూలంగా తెలియజేస్తున్నాము.






మన ఆహారంలో శరీరదార్ఢ్యతకై ప్రొటీన్లు, విటమిన్లు, ఖనిజలవణాలు ఇంతింత ఉండాలన్నమాట తెలిసేకూడా లోపాలను గమనించకుండా మనకలవాటు అయిన ఆహారమును మాత్రమే తీసుకుంటాము.

మన ఆహారములో సాధారణంగా విటమిన్లూ ఒకటి రెండు ఖనిజలవణాలూ మొదలైన శరీర రక్షణకు కావలసినవి లోపిస్తున్నాయి. ఈ లోపం తీర్చడానికే అనేక విటమిన్ల సారమిశ్రమముతో మెక్లెక్ వారి "మల్టివిటమిన్" అనే బిళ్లలు తయారయాయి. ఇదిగాక ప్రొటీన్లు మొదలైన యితర మూలవస్తువులు లోపించినచోట కావలసిన ఇతర పోషక ఆహారాలున్నాయి. అందుచే మీరు అలవాటు వల్లయే ఆహారమే తీసుకున్నా లోపాలను సవరించుటకు మెక్లెక్ వారి పోషకఆహారములను తీసుకొనుట ఆరోగ్యానికి అత్యావశ్యకమని శాస్త్రవేత్తలు చెబుతున్నారు.



**మెక్లెక్**
**న్యూట్రిమెంట్సు**

*మీ ఆహార పదార్థాలను సమ పాలనంచేయును*

సవివరాలను ఈ క్రింది వారినడగండి.
మెక్లెక్ న్యూట్రిమెంట్సు అండ్ ఫార్మాస్యూటికల్సు, లిమిటెడ్.
99, ఎ. ఆర్మీనియన్ స్ట్రీట్ జి. టి. మద్రాసు.

MNP.44 Telugu

# స్త్రీలు - ప్రాథమికస్వత్వములు

అఖిలభారత మహిళామండలి అధ్యక్షు రాలు లేడీ ధనవంతి రామారావుగారి అధ్యక్షతను ఆ మధ్య పూనాలోజరిగిన స్త్రీల సమావేశంలో స్త్రీలకు ప్రాథమిక హక్కులు చేకూర్చాలని, జీవితం ప్రమాణానికి తగినవేతనాలు, పురుషు లతో సమానంగా పని-వేతనం, కార్మికసంస్థ లలో పనిచేసే స్త్రీలకు తగిన సౌకర్యాలు సమకూర్చడం అత్యవసరమని తీర్మానించారు.

గత యుద్ధంలో, స్త్రీలు పురుషుల స్థానాల నాక్రమించి, తాముకూడా పురుషులతో సమాన మైన నేర్పుతో బుద్ధికుశలతతో పనిచేయగల మని ఋజువు చేశారని—అందువలన స్వతంత్ర భారతావనిలో—అన్ని రంగాలలోను స్త్రీలకు పురుషులతో సమమైనహోదాను, సావకాశా లను, స్థానాన్ని ఏర్పాటుచేయాలని లేడీ రామారావుగారు వక్కాణించారు.

వేతనాల విషయంలో స్త్రీలకు చిరకాలం నుంచి గొప్ప అన్యాయం జరుగుతున్నది. ముఖ్యంగా ఫేక్టరీలు మున్నగు పరిశ్రమలలో పనిచేసే వారి విషయంలో పురుషులకన్న స్త్రీ లకు తక్కువ కూలి నీయడం పరిపాటైంది. ఈ జాడ్యం ఒక్క మనదేశంలోనేగాక ఇంగ్లాండు వంటి అనేక నవనాగరక దేశాలలో, మహిళా సంఘాలు ఎంత పోరాటం సాగించినా ప్రయో జనంలేక, చిరస్థాయిగా నాటుకుపోయింది. ఇంగ్లండులో ప్రభుత్వ శాఖలలో—స్త్రీలకు పురుషుల కిచ్చే జీతంలో అయిదింట నాల్గవ వంతు మాత్రమే ఇస్తారు. సమానార్హతగల ఇరు పురు వ్యక్తులమధ్య ఒకేవిధమైన పనిచేయడానికి ఇట్టివ్యత్యాసం చూపించడం శోచనీయం.

స్త్రీ పురుషవిచక్షణను తొలగించుటలో రష్యాదేశం ముందంజ వేసింది. "ఆర్థిక రాజకీయ సాంఘిక వైజ్ఞానిక రంగాలలో స్త్రీ పురుష విచక్షణ ఉండదు" అని రష్యారాజ్యాంగ విధా నంలో నిరూపించారు. వృత్తులు, వేతనాలు, సౌకర్యాలు, సాంఘిక బామీా మున్నగు విష యాలలో సర్వసమానత్వ మేర్పాటు చేయడమే గాక, స్త్రీలకుగాను మరికొన్ని ఇతరసహాయా లను రష్యా ప్రభుత్వం చేస్తున్నది.

భారతదేశంలో ఇంతగా పురోగమించక పోయినప్పటికి భావిభారత రాజ్యాంగనిర్ణాయక సభవారు, ప్రాథమిక హక్కుల జాబితాలో, "ప్రభుత్వంవారు ఏ పౌరునిపట్ల జాతి, మత, స్త్రీ, పురుష వివక్షత చూపించరాదు" అని పేర్కొన్నారు.

ఈ విధంగా స్త్రీలకు సమాన హక్కు లను చేకూర్చుటలో మహిళలు పెద్ద పోరా టాన్ని సలపవలసిన అగత్యం లేకుండగానే భారత ప్రభుత్వం ఆ హక్కును చేకూరుస్తుందని ఆశిస్తున్నాం.

—వినాయక్.



# ఊటీ

రచన: శ్రీ కొండేపూడి శ్రీనివాసరావుగారు

ఉత్తరభారతదేశంలో వేసవిలో చల్లదనానికని సిమ్లా, డార్జిలింగు ఏలాగ పోతుంటారో, మన దక్షిణావనిలో ఉదకమండలం, కొడైకెనాల్ అలాగ పోతుంటారు. ఎత్తుకుపోయేకొలది వేడి తగ్గుతూంటుంది. ఉదకమండలం నీలగిరికొండలపై 7228½ అడుగుల ఎత్తున ఉంది. అంత ఎత్తున ఉండబట్టే వేడి తక్కువ. అందుచేతనే వేసవిలో ధనికులంతా అక్కడికి చేరుతూంటారు. దీనినే ఊటీ అని వ్యవహరిస్తూంటారు.

పోతే అంతపైకి ప్రయాణ సౌకర్యాలెలా ఏర్పాటు చేయగల్గారా అన్నది తెలుసుకోదగ్గవిషయం. అంత ఎత్తుకు కూడ రైళ్ళు, బస్సులు సైతం పోతాయి. బస్సులు అంచెలంచెలుగా సున్నాలు చుట్టుతూ పైకి ఎక్కుతాయి. ఆరోడ్లు అత్యంతరమణీయంగా ఉంటాయి. పర్వతప్రాంతంలో ప్రకృతి శోభాయమానంగా ఉంటుందని వేరే వ్రాయనక్కరలేదు. బస్సులు పైకి ఎక్కుతూండడం, మళ్లీ ఏటవాలుగా దిగుతూండడం- ఎలాగయినా అటువంటిప్రదేశాల్లో బస్సులో ప్రయాణం చేయడం మహదానందంగా ఉంటుంది. ఎత్తునకు పోయేకొలది బస్సువేగంతోపాటు చల్లటిపవనాలు కూడ అతివేగంతో వీస్తుంటాయి.

కొండపైకి రైలులో ప్రయాణం చేయటం అదొక ఆనందం. కోయంబత్తూర్‌లో తెల్ల తెల్లవారుతూంటే 'బ్లూ మౌంటెన్'లో ఎక్కాం. రైలు జోరుగా పరుగులు తీస్తోంది. పొగమంచులో కప్పబడిన పర్వతాగ్రాలను, అక్కడే విశ్రమించాయా అన్నట్లుండే మేఘాలను, ఆ లేత మబ్బులను చీల్చుకొంటూ భానుడు తన అరుణకాంతులను ఆ వినీలనగాగ్రాలపై ప్రసరింపచేస్తూ ప్రకృతికిచ్చే నూతన శోభను పవనవేగంతో పరుగులుతీస్తున్న పొగబండి గవాక్షముగుండా పరికిస్తూంటే మొన్న మద్రాసులో జరిగిన ఆంధ్రాభ్యుదయ రచయితల మహాసభలో ప్రదర్శించిన చిత్రాగారి దిత్రాలు చటుక్కున స్ఫురణకొచ్చాయి. చిత్రాగారెంతగా ప్రకృతిని పరిశీలించి, ఆదృశ్యాలన్నీ బాగా హృద్గతం చేసుకొని రచించారోగదా ఆ అమూల్య చిత్రాలు!

ఆ ప్రకృతి అలంకృతిని అవలోకిస్తూ ఏమేమొ ఆలోచిస్తూండగ మెట్టుపాళెయం వచ్చింది. ఇక్కడే ఊటీకి రైలు మారాలి.

ఊటీకి పోయే రైలుబండిలో రెండే తరగతులుంటాయి. ఒకటవ తరగతి-మూడవ తరగతి-అంతే! చిన్నచిన్న పెట్లు, చిన్న ఇంజను. రైలుబండి చూడడానికి ముచ్చటగానే ఉంటుంది. ఇంజను అన్ని పెట్టెలకు వెనకాల ఉంటుంది. వెనుకనుంచే గెంటుతుంది. ఈ కొండ రైలుమార్గము కూడ వింతమార్గమే. కొండ ఎత్తుకి ఎక్కేచోట్ల మూడు రైలు బద్దీలుంటాయి. మామూలుగా ఉండే రెండుఇనుపబద్దీలు కాక మధ్యన పళ్లుపళ్లుగానున్న మరొక బద్దీ ఉంటుంది. ఇంజనుకి ముందున ఉండే రెండుచక్రాలు కాక మరొక పళ్లు పళ్లుగల చక్రం ఆ రెండు చక్రాల మధ్య ఉంటుంది.

ఇప్పుడు ఈ కొండ ఇనుప దారులకు మధ్యన ఆపళ్లుపళ్లుగల మరొకబద్దీ, ఇంజనుకి మరొక పళ్లుపళ్లుగల చక్రం ఎందుకవసరమో, ఇంజను వెనుకనుండి గెంటుటవల్ల లాభమేమిటో యోచిద్దాం.

ఇంజను ముందునుండి లాగుతోందనుకోండి. రైలు కొండపైకి ఎక్కుతోందనుకోండి. ప్రమాదవశాన ఇంజనుకి పెట్టెలకి ఉండే లింకుగాని, పెట్టెపెట్టెకు ఉండే లింకుగాని ఊడిపోతే ఆరైలుపెట్టి, అందులోని ప్రజలు దడదడా క్రిందికి పోయి పిప్పి కావలసిందే. అందుకనే ఇటువంటి ప్రమాదాలు సంభవించకుండా ఇంజను పెట్టెలను వెనుకనుండి గెంటుతుంది. ఇప్పుడు పెట్టెకు పెట్టెకు ఉండే లింకు ఊడిపోయిన ఇబ్బంది ఉండదు. అయితే ఇంజనుకి రైలుపెట్టెలకున్న సంబంధం పోతే ఎలాగ? అనేది తర్వాత ప్రశ్న. అందుచేతనే మరొక మూడవ బద్దీ వేయబడింది. రైలు కొండ

ఎక్కుతూండగా వెనక్కి రావడానికి ప్రయత్నిస్తే ఇంజనుకి మధ్యనున్న పళ్లుపళ్లుగల చక్రం పళ్లుపళ్లుగల మూడవ బద్దీతో పట్టుబడి వెనక్కి పోజాలదు. ఆచక్రం పళ్లు, రైలుబద్దీ పళ్లు అలా అమర్చబడుతాయి. ముందుకు ప్రయాణం చేస్తూంటే అవి అడ్డురావు. రైలుకొండపైనుండి దిగేటప్పుడు ఇంజను ముందే ఉంటుంది.

అనేక చోట్ల రైలు దొలిచిన కొండ గుహలగుండా పోతుంది. ఈ గుహలు రెండువందలు మొదలు 7 వందల అడుగుల పొడవు వరకు ఉన్నాయి. రైలులో ప్రయాణం చేస్తూ క్రిందనున్న లోయలు, మైదానాలు, ముక్కోణాకారపుచెట్లు, పేకు వెదురు అడవులు, యూకలిప్టస్ చెట్లు, సింకోనాచెట్లు, టీతోటలు వివిధపుష్పజాతులు, చూడడానికి నేత్రోత్సవంగా ఉంటాయి. కొండశిఖరాలనుండి రాలేజలపాతాలుకూడా మనకెన్నో కనిపిస్తాయి. అంతకంతకి ఎత్తుకి పోయేకొలది సూర్యుడెంత ప్రకాశిస్తున్నా ఎండ అనిపించదు. జలపాతాలనుండి, పర్వతశిఖరాలనుండి ప్రసరించే పవనాలన్నీ అమృతప్రాయమైన చల్లని మలయ మారుతాలగా మారిపోయి మామేనులు సోకుతూంటే ఆహ్లాదంలో ఆకలినే మరచిపోయాం.

తర్వాత ఊటీలో చూడవలసింది దూరదూరంగా విడివిడిగా కట్టబడిన భవనాలు. అత్యంత సుందరమయిన ఉద్యానవనాలు ముఖ్యంగా (Botanical Gardens) చూచితీరవలసిందే! వింతయైన వ్రేలాడే వంతెనలు చూడాలి. కొండ లోయలు, వాగులు మొదలయినవి దాటడానికి వ్రేలాడే వంతెనలు (Hanging Bridges) బాగా ఉపయోగపడుతున్నాయి. లోయలకిగాని, వాగులకిగాని రెండు ఒడ్డులా ఎత్తైన ప్రదేశాలలో బలమైన స్తంభాలు పాతి వాటికి ఇనుప త్రాళ్ళు పొడుగునా రెండు ఎడయెడంగా వ్రేలాడతీసి ఉయ్యాల మాదిరిగా వాటిల్లో ఆ పొడుగునా కర్ర బద్దీలతో వంతెనగా తయారు చేస్తారు. ఆ వంతెనల మీదుగా బస్సులు, బండ్లు అన్నీ ప్రయాణము చేయవచ్చు.

వింతల్లోకెల్లా వింత ఏమిటంటే-యూకలిప్టస్ చెట్లు సమృద్ధిగా ఇక్కడున్నాయి, మిగతా చోట్లకంటే యూకలిప్టస్ ఆయిల్ ఖరీదిక్కడే అధికం!



# విశాఖ నీటివసతి

“విశాఖపట్నంలో, మూడు రోజులు, నీటి చుక్క కూడా కంటికి కనుపించ”దని భవిష్యత్ చెప్పుచున్నారు. ఇది నిజమేమో అనిపిస్తున్నది. పంపులకు నీరు ఎక్కుట లేదు. డాబాతోటలో సరిగా 48 అడుగుల లోతులో నీరు ఉన్నది. అదైనా ఏ రెండు నూతులలోనో! నీటికి పడుతున్న బాధ వర్ణనాతీతం.

మునిసిపాలిటీవారు 2 లేక 3 మైళ్లదూరంనుంచి ఇటువంటి బండ్లతో నీరు తెచ్చి ఇంటికి 6 బిందెల నీళ్లు ఇస్తున్నారు. చుట్టు ప్రక్కల పంపులుగాని మరి ఏ ఇతర నీటి వసతిగానిలేదు. ఇచ్చట జనులు ఏ విధంగా జీవించగలరా అని విన్న ప్రతివారు ఆశ్చర్యపడక మానరు.

బియ్యం, పప్పులు మొదలైనవే కాక నీటికికూడా రేషనేనా? ఇన్ని చిక్కులు పడుచున్నప్పటికీ గవర్నమెంటు వారు, ఇదుగో అదుగో అని ఇంకా ఎన్ని దినములు, మేఘాద్రిగడ్డ, గోస్తనీ, స్కీములు ఇచ్చటకు తెచ్చుటకు ఆలోచించెదరో?

స. కామేశ్వరి బి. ఏ.



Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. P. Press, 12 Thanikachalam Chetty Road, T'Nagar, Madras.

